...గీరత, గుంటూరుసీమలయొక్క భాగములచ్చుమగిసినతోడనే నాకుబంపుటకొరకు, నాపేరునురిజిష్టరుజేసికొని ...కృతజ్ఞతాబద్ధునిగా వింపవేడుచున్నాను...నిన్నటిదినమున, కొప్పరపువెంకటసుబ్బారాయ, కవిగారిగ్రామము మగుదేరగా గుంటూరుసీమవలన, వారి సుస్వభావము నెరిగినవాడనగుటచే, అయ్యా! గుంటూరుసీమందిలకించితిరా? తమజల్లిసీమయేమైనదని యడుగ, నేమేమో, ప్రగల్భములంబలికి, జల్లిసీమ, నెలదినములలో వచ్చుననిరి ..గుంటూరుసీమయొక్క పూర్వరంగమును తనివిదీరగాంచితి, కొప్పరపువారి యసత్యప్రకటనలును, తమసత్యనిర్ధారణలును, మధురసుధాధారలొలుకు తమకవితానైపుణ్యమును నాకేగాక సర్వాంధ్రులకమందానందము నొనరింపక, మానవని ఘంటాపథముగఁ జెప్పకతప్పదు

మాకరాజు నారాయణరాజు. గుంటూరు 17-4-13

గవర్నమెంటుట్రయినింగుస్కూలు.

...గుంటూరుసీమ, చదివితిని. అఖండమగు మీకవితయందలి కథావిషయగమనము అత్యద్భుతముగనున్నది. ఈకథా సంవిధానపరిపోషణ ఆంధ్రవాఙ్మయమునందు ఒకరిద్దఱు సనాతనకవులయందు తిక్కన, పినవీరభద్రుఁడు, తక్క లాఁతి యొడలఁగనుపట్టదు...” రుక్మాపూర్ హౌస్ తిరువల్లిక్కేణి 2-7-13.

రాయప్రోలు సుబ్బారావు.

...గుంటూరుసీమ పూర్వరంగమను గ్రంథమును... నందుకొంటిమి...సదరుగ్రంథము మాసంశయములను బోగొట్టి నిజమైనవిషయములను దెలియఁబఱచినందులకు మేమెంతయుఁ గృతజ్ఞులము. “నిజమునిలకడమీదదెలియు” ననులోకోక్తి కల్లగాదుకదా? వేయేల! సర్వవిధముల యీగ్రంథము సప్రమాణముగాను, బక్షపాతరహితముగను, చరిత్రాత్మకముగను, వ్రాయఁబడినదనుటకు సందేహములేదు. దీనింగాంచియైనను గల పాశనులు మౌనముద్రను వహింతురుగాత.

Secunderabad Daccan. ఏ. యస్. రామకృష్ణులు. 30th March I913

ఉ॥ చూచితినండి సీమ, పరిశుద్ధవచోనిచయాభిరామ, వి
ద్యాచతుర ప్రమోదధనధామ, యథార్థకథానకోక్తిము
ద్రాచణకామ గాత్రిస్యకవి తంత్రబహిష్కృతి దేవభామ, యం
బాచరణాంబుజాతరసబంభర శ్రీపతి వేంకటేశ్వ॥. ౧

శా. ప్రాచీపశ్చిమదిక్ స్థితాంధ్రకుకవిప్రాణానిలాహీంద్రమై
వాచాదోషవిశేషరిక్తజనతావక్త్రావటాసారమై
భూచక్రోపకృతిప్రసూనలతికా స్ఫూర్జద్వసంతర్తువై
తోఁచెన్ జుండి చరిత్రయుగ్మము కవీంద్రశ్రేణి చూడామణీ. ౨

క. గిరతమా! యత్యద్భుత, ధీరులవసఁదేల్చె 'సీమ' తేల్చె సహోత్థ
శ్రీరాజులవసఁనార్యులు, చారుప్రజ్ఞులు భవత్ప్రశాంతికి మెచ్చన్. 3

భాషాత్రయశాలి. 22-4-13 గుంటూరు అగ్రహారం

D. Ramaswami Sastri.

ఉ. దైవముఖమ్ముఁజూచి సమతన్ వహియించి చరిత్రయుగ్మమున్
భావవిదుల్ సెబాసనఁగ వ్రాసితి రౌనసుశైలిఁ దాము, మీ
చేవ యథార్థ గౌరవ విశిష్టము 'శిష్టజనైక వేద్య' మో
దేవ? భవత్ప్రతాప మతి దృప్యదరిప్రతిబంధకం బహో.

గీ. సకలలోకమ్ములకు సత్యసత్త్వ మిట్టి, దనుచుఁ దేల్పంగఁ దాము వ్రాసినచరిత్ర
'సీమ' నాకొండువ్రతి వీ.పి చేరఁజేయ, వెంకటకవీంద్రమొక్కెద వేవిధముల.

మాగంటి వీరరాఘవశాస్త్రి. 24-8-13

...గుంటూరిసీమ, యనువివాదాంశగ్రంథమును నామూలాగ్రముగా జదివితిని సోదరకవులకునుమీకును గలిగినవివాదసందర్భములో మీకు తప్పేమిలేనట్లు యీగ్రంథమువల్ల యథార్థము బయల్పడినది...ఉత్తరరంగము కూడ...పంపగలందులకు ప్రార్థించుచున్నాను, ఖరీదుఎంతయిననునరేముందుశంపుమనినెలవిచ్చినపంపెదను.

చించినాడ వేంకటరత్నశాస్త్రి. బెజవాడ 29-4-13

గీ. నిరులఁజెన్నొందుగుంటూరుసీమ ప్రథమ, రంగమును గాంచితిప్రాంతరంగుఁడైతి,
వెలయనుత్తరరంగము వేమవరశ, తావధానను వీ. పి. గాదయనుపంప,
గోరివందములు సేతు, కోర్కెమీఱ. చివుకుల పిచ్చయ్యశాస్త్రి.

స్కూల్సూపర్‌వైజరు, పొదిలె, నెల్లూరుజిల్లా, ముకాం తర్లుపాడు 21-7-13

శా. కనుఁగొనలేక మీప్రతిభఁ గల్లరు లల్లినప్రల్లదంబులన్
గనివినియుబ్బపండితుఁ డొకండు శతంబున నైన నున్నె? యుం

డినవలదిక్కుటాహముల నిండి పయిన్ బయిఁ బొంగి నింగిఁ బా
టినభవదీయకీర్తిలహరిన్ నిలుపంగ నెవార లోపెడిన్. ౧

చ॥ అనదలు కూళ లేరొకో యహంయుతులై తమనోటియానుపో
వ నుడువురిత్త పలుకులను వంచనకల్గునె? "యూరకుకూ
సీనయెడ జంగమయ్య కిలఁజేటగునే?,, బుధులేరు విన్న సీ?
యనుచుఁ జకారగుళ్లొఁనగరా? నగరా? మొగమెత్తనిత్తురా. ౨

ఉ॥ "అక్కనమాదనల్ చెలఁగునందల మెక్క నరప్ప సాటికిన్
నిక్కుచుఁజెర్వుఁ కట్టపయి నిస్త్రపతన్ వెన నిల్పుమాడ్కిఁ,, దా
రొక్కటరెంటఁ బామరులయొద్ద రహఃకుహనావధానమున్
జక్కనొనర్చి రన్నఁ దమసాటికి వత్తురె తక్కుఁగైనరుల్. ౩

చ॥ అనవసరంపుఁ జివ్వకు నహంయుతులై విఫలోరుశాఖ దార్
పెనఁగొని మున్గడించు పెనుపేరుల నీటఁగలంచి నట్టి రీ
వినయవిలేక శాలు లిఁకిఁబెగ్గల వీడి రహస్థలంబులన్
గొనఁగుటమాని యిష్టయిన 'గుంటురిసీమకు' మ్రొక్కఁగాదగున్. ౪

క॥ సారతరహృద్య పద్యను, ధారసనిష్యంది గీరతముబలెనరయన్
మీరచిత, సీమ,సరసం, బై రాజిలె సఖిలసూరు లౌననిమెచ్చన్.

రామడుగు సీతారామశాస్త్రి. 14-1-14

..."గుంటూరిసీమ" చేరినది.., మిక్కిలి శ్రమకోర్చి ఆయాపత్రికలయందలి విషయములను ముందెన్నడో గ్రంథము వ్రాయవలయునని సేకరించి గ్రంథముతయారు చేసినందువల్ల తమకు 'చాణక్య' లనుబిరుదు సార్థకమైనదానినిగా దలంచుచున్నాను. తాము నిజములని వ్రాయించిన విషయములెల్లను నేను పత్రికలయందు చూచినవగుటచే యిందుమీరెంతమాత్రము అనృతము వ్రాసితిరని నేతలంపను.

వేమూరి సుబ్బరామశాస్త్రి. ఆళ్లమూడి 6-6-13

గీ॥ అంతియేకాక నారాయణశాస్త్రి మొకఁడు, బయలువెడలిగుంటురిసీమపటిమనెల్లఁ
జించిచెండాడివెనుఁజూపఁజేయునంటనియుఁ, కేమిపురికెక్కుగుంటూరుసీమవగ్గ
గీ॥ కాననారాయశాస్త్రిమున్గ్రగమ్మియాటు,మూడునేయకయున్నె సమ్మోదమలర
నారయన్ గోరినాడఁ గుంటూరిసీమ, లోని యుత్తరరంగమున్ లోకవినుత.

తెలికెపల్లి రామచంద్రయ్య. 25-2-14

శ్లో॥ ... పూర్వరంగ మమలం దృష్ట్వాఽఖిలం మానవ
స్స్వాంతే మోదముపైతి సంత్యజతి శాఖాపక్షపాతాదికం॥

శ్లో॥ కాత్యాయనస్యైవ సమస్తం పరికథిత మను జాత్యైక దేశ ప్రగల్భ
న్యాయాశాఖాభిమాన ప్రకటితవశగాశక్తదౌర్జన్యజన్యం...”॥

శ్లో॥ ... శాఖాం విజానాతి హి నీతి బాహ్యక॥

శ్లో॥ రాజ్ఞాంగృహేషుధనశూన్యగృహేషుసర్వంతుల్యంద్వాహా కాంక్షవిభవైర్న సమా
న్యైరేవ, తద్వత్ర వితర్వరచనా సుచసంతిబహ్వ్యః పాండిత్యవైభవమిదంతువి
చారణీయం॥ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి. 4-4-1913

మండవల్లి లింగాలపోష్టు, కృష్ణాజిల్లా.

మ॥ హరనారీ చరణాబ్జ చింతనమరందాసక్త హృద్భృంగియు
త్తరరంగం బెపుడబ్బునోయనుచు సత్యాసక్తుఁడై వేంకటే
శ్వరదైవజ్ఞుఁడు దానినే మదిసదా భావించుచున్నాఁడు కా
సరయంబొప్పఁగఁ బంప వేఁడెదఁ గవీన్ద్రా! ముద్రణంబైన చోన్.

ములుకుట్ల కోటీశ్వరః. 9-7-13 యింకొల్లుగ్రామం

..."గుంటూరుసీమ" యను గ్రంథములు ఆరు కాపీలు V.P. ద్వారా తగు
సంతతొందరలో నా అడ్రసుకుఁ బంపఁ బ్రార్థించెదను. ఉభయభాషాకవిత్వమహాకవు
లగు తాము ప్రకృతచర్యనంతయు కలికాలము పైదోసివేసి.. సంతలో ... మాహాత్మ్యవి
ము... అధికమగుననియు. పెద్ద లనుకొనుటను విని విశదపఱచుకొంటిని

మన్యం సీతారామయ్య. 2-4-13
టీచర్. టవును హైస్కూల్ గుంటూరు

...గుంటూరుసీమను చూచినాను అందునిజానిజములు తప్పక తేలుచున్నవి. యి
ట్టి సత్యమును దెలుపు యీపొత్తము దేశమంతటను వ్యాపింపచేయుటకు భగవం
తుని సదా ప్రార్థించుచున్నాను. బొడ్డుపల్లి శేషయ్య. బోర్డుస్కూలు, మాష్టరు.
మందపాడు 27-3-13

స్థాలీపులాకన్యాయమునఁ జూపితిమే కాని మావద్ద నున్నసామగ్రిలో నెన్నవవంతుగాని చేకొనలేదు, సరికదా? వారినామములుగూడ నుదాహరింపలేదు, పాఠకశ్రమ ప్రతివిషయమునకును గ్రంథవిస్తరభీతియే మమ్ము వెనుదీయించుచున్నది, పీఠికలో నక్కడక్కడ నుదాహరించిన ప్రతివిషయమును నేదో యొకటితక్క నిక్కే లవలేశముగాఁ జేకొనినదియే కాని యేదియును బూర్తిగా చేకొననేలేదు, ఈలోటు రాఁబోవు 'నమస్కార' గ్రంథపీఠిక తీర్పఁగాక యని యింతతో విరమించుచు నిఁక నిందలి తప్పులం గూర్చి కొండొక చర్చించుచున్నారము, ఎచ్చటనేని యతిప్రాసములు, వ్యత్యస్తము లగుటంగూర్చి ప్రాజ్ఞులు గణింపరు, అది భ్రాంతిమూలకము, అనివార్యము, దానింగూర్చి యితరులకు గోచరించినంత గ్రంథకర్తకు గోచరింపదు, ఆవిషయముకని పెట్టుటకుఁ బాండిత్యముతో నవసరము లేదు, యతిస్వరూప, ప్రాసస్వరూపములను దెలిసికొనుటకు సరిగా 5 నిమేషములకన్న నెక్కుడు కాలము పట్టదు. అట్టి స్వల్పవిషయమును గూర్చికూడ దినంతులు గొట్టువారు నేఁడు బయలుదేఱుటచే నీకాలముయొక్క దుస్థితికిఁ జాల విచారపడవలసియున్నది. ప్రకృతము, హితకారిణీమనోరంజనులు మాకుఁదప్పులు చూపవలయునని యెంచి పైరీతి తప్పులనే యన్వేషించి యవాకుచవాకులను వదరుచున్నవి, ప్రథమముద్రణము నందలి స్ఖాలిత్యముల నిటీవల ~~నెవరో~~ మాటుకూడఁ బాటింపక యీపత్రికలూరక ప్రోఁగ మొదలిడుట మఱియును విచారణీయము, స్వాత్మదౌర్బల్యప్రకటనమునకై తమంతఁదామే పలువిధముల సాక్ష్యము నిచ్చుచున్న యీపత్రికలు చూపు తప్పులెట్టివో తెల్పుటకుఁ బ్రకృతగ్రంథమునుండి కొన్ని యుదాహరించుచున్నారము.

“వి। ద్యామహేంద్రులు పద్యశబ్దముపైని సారెకుఁ గొందఱు

ఇందు విశ్రమము పొరఁబడినది, దీనింబట్టి యజ్ఞతను సమర్థింపనెంచుచో తి॥ వెం॥ కవులకు, యతియననేమో తెలియదని కాని, అక్షరజ్ఞానము లేదని కాని, మొఱుఁగవలసి యుండును. ఈమాట విశ్వసింపఁజేయుట కడుఁగష్టము, ఇట్టి ప్రయత్నమునకుఁ బాటుపడువారి నేమనవలయును? మఱియు.

డం॥ బలరు నియోగి వైదికులు నందుచునుందురు.

(పూర్వరంగము 4వ పుట 6వ పద్యము చూ)

ఇందుఁ బ్రాసము పొరఁబడినది, పైపద్యము రేఫప్రాసకము, కావున, అల

రు, ఒరయు, అందు, ఒందు, గా మార్చికొన్న సరిపోవచ్చును, యతివిషయమున 'వశ్యశబ్దము తప్పుగాదని కొందఱు' అని సవరించుకోవలెను. ఇట్టి భ్రాంతి ప్రయుక్తములగు స్వల్పలోపము లెందఱచేతనో యెన్నిసారులో సంస్కరింపఁబడు చువచ్చినను భారతాదులయందుఁగూడ నిప్పటికిని గ్వాదితక్రముగాఁ గానవచ్చు చున్నవన నస్మదాదులలెక్కయేమి, భ్రాంతినశించినఁగాని యీలోపములునశిం పవు, అది ప్రపంచముతోపాటుండఁదగినది, బ్రహ్మాదులుగూడ దానికిదాసులు, ఇదివిషయాంతరము, ఇంకనువ్రాయవలసినవి చాలనంశములుగలవు, వ్రాసిన వానివలనఁ దక్కినవి యూహించుకొందురుగాక, పూర్వరంగోత్తరంగములలో సూత్రప్రాయముగా నాయీవివాదకు సంబంధించినయావద్గాథయు నిముడ్చఁబడి నది, ఆది ఆసనచర్యయు, అంతము వేమవరావధానప్రయుక్తమగు సమ్మాన మును సనియెఱుఁగునది, ఆసమ్మానసమయమునందలి పద్యములుమాత్ర ముదా హరించి విరమించుచున్నారము.

చ॥ తిరుపతివేంకటేశ్వరసుధీకరయుగ్మ మలంకృతంబు చే
సిరికద? కంకణంబులఁ బ్రసిద్ధులు నల్వురు చెన్నయాను ల
బ్బురమును సంతసంబు నెదఁ బొంపిరివోవఁగఁ జూచుచున్నయం
దఱనయనంబులందవి కనంబడుచున్నవదేమి చిత్రమో.

తి॥ శా॥

ఉ॥ ‹గోడకు వెల్ల వేయు టది గోడహితమ్మును గోరి కాదు మో
మోడి భవత్కుతూహలము నోముఁగ సింగపుమేల్మిబంగరుం
బోఁడిమికంకణమ్ము లివి పూనుచునుంటిమి యిందు కర్హుఁడౌ
వాఁ డెవఁడో? యెఱుంగఁగలప్రాజ్ఞులుముఖ్యులునేఁడు చూడఁగన్

వెం॥ శా॥





శ్రీమత్పరదేవతాయై నమః.

# గుంటూరిసీమ, ఉత్తరరంగము.

శ్లో॥ ఉన్నతం పద మవాప్య యో లఘు, ర్హీలయైవ స పతే దితిబ్రువం
శైలశేఖరగతో దృషత్కణ, శ్చారుమారుతధుతః పతత్యధః॥
(రసగంగాధరము చూ)

శ్లో॥ యద్యపి నదతి సరోషం, మృగపతి పురతోఽపి మత్తగోమాయుః
తదపి నకుప్యతి సింహో, విసదృశపురుషేషు కః కోపః॥
(అలంకారశేఖరము చూ)

శ్లో॥ సంత స్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యంత్రణా
స్సరత్రైవ జనాపవాదచకితా జీవంతి కృచ్ఛ్రం సదా
అవ్యుత్పన్నమతిః కృతేన నసతా నైవాసతా వ్యాకులః
కృత్యాకృత్యవివేకశూన్యహృదయో ధన్యో జనః ప్రాకృతః॥
(కువలయానందము చూ)

(సదుపదేశము)

చ॥ వలదు నియోగివైదికవిభాగము, కొంపలు ముగ్గదాన, వ
ర్తిలుఁడు యథానుపూర్విగ, విధేయులు విద్యకుఁగండు శాఖమన్
బల మిడ నెంచి సగ్రంథమును బాయఁగఁ ద్రోచు టదేటి తెల్వి, పూ
ర్వులహృదయం బెఱుంగుఁ డని బోధ యొనర్పఁ గదమ్మ శాంకరీ॥

చ॥ వలదు నియోగి వైదికవిభాగము వల్వ దసత్యగోష్ఠి, ము
గ్ధులను విదగ్ధులన్ సరిగఁ దూఁచెడి తక్కెడవై ప్రియత్నమా,
వల దపలాపముల్ గిలుక వల్వదు వల్వ దటంచు నంబికే
వలదురితంబుగా నడుచువారిఁ దలకాళ్ల కురిన్ ఘటింపుమీ॥

చ॥ వలవనికోర్కులం బడినవా రెవరున్ దుద నెగ్గ లేద, యీ
కలియెడఁగూడ సత్యమునె కాంతురు గాని యసత్యమన్నఁ బె
ద్దలకుఁ బ్రపత్తి లేదు ఋజుధర్మము పట్టి చరింపుఁ డంచు మూ
ర్ఖుల ననిశాల్పు పెద్దలకుఁ గొండొక బోధ యొనర్పు మంబరో. ౩

## గ్రంథప్రవృత్తి.

చ॥ సత్య, మసత్య, మంచు మనుజన్ములమంచికిఁ జెడ్డకున్, సదా
దౌత్యము సేయుచుం డెడిపదార్థము లందొక దాని కింకొకం
డత్యయమున్ ఘటించెడి యథార్థపదార్థము నిల్పయోగ్యులున్
బ్రాత్యులు వేఱొకండు నిలుపన్ బ్రయతించుచునుంద్రు శాంకరీ. ౧

చ॥ నిలిపిన నిల్వఁ జాలని దనిత్య మసత్యము, నిల్పకున్నను
న్నిలిచి యెనంగఁజాలినది నిత్యము సత్యము, సత్వరప్రభా
కలన కెదే నిమిత్త మది గావలెఁ గావున దానికై మహా
త్ములవచనంబు లూఁత గొని పుస్తక మియ్యది సేయుమంబికా, ౨

ఉ॥ నోటుకుఁ గాలదోష మది నోటియెడన్ గొఱ గాదు కాన నే
ప్పాటను యుక్తి సేయుడు నపర్ణత గల్గదు తప్పుత్రోవలం
దాఁటెడివారిరజ్జులు వృథా, ఋణ మిచ్చి యపర్ణుఁడున్ ద్విష
త్కోటి నెదిర్చి పేర్చికవికుంజరుఁడున్ వెలుఁగొందు నంబికా. ౩

మ॥ మనవాఁ డెవ్వఁడు? సత్యముం బలుకు సంపత్కామి, యన్యుం డెవం
డనృతం బాడెడిదేబె, యీనియతికిన్ న్యాయైకదృష్టుల్ శ్రుతుల్
దనియన్ మ్రొగ్గెద రన్యులో? మొఱకులై "తాఁబట్టకుందేటికిన్
జనుఁ బాదత్రయమే" యటన్ననుడికిన్ దాసానుదాసాగ్రణుల్. ౪

మ॥ ధనమున్ జూడరు వేషభాషలకుఁ బందల్ వోలె లోఁ జంక రా
వ్వని కేగౌరవ మంతెకాని యధికత్వం బొప్పఁగాఁ బోగు న
జ్జనులన్ దక్కఁ దదన్యులన్ మనమునన్ జర్చింపఁ గాఁ బోరు, ధీ
ఖనులంచున్ జననీ! ఋతం బడఁచు ప్రాజ్ఞశ్రేణికిన్ దెల్పుమీ. ౫

## పూర్వవిద్వన్నాగరికత

శా॥ *"మీవిద్దెల్ ధన మిచ్చి కొన్నయవి మీమీపోకలెల్లన్ ధనా
శావిద్ధంబులు పూర్వనాగరికవిద్యాభ్యాసముల్ వేఱు,త
ద్భావస్ఫూర్తులు వేఱు, వారు మనకై దైన్యంబు నైకోరు మీ
తీరౌవల్ వారికి నైచప రాని వని యుద్బోధింపుమీ శాంకరీ. ౧

శా॥ పూర్వాచారులవిద్దె నేర్చుగుణలుబ్ధుల్ వారిమర్యాదలే
సర్వోత్కృష్టము గాఁ దలంతు రిపు డాచారమ్ము లే మున్నవీ
దుర్వారుల్ గనఁ బోరు, దూర్వలె నయా దుర్వాసుతో నందు రో
శర్వాణీ! యిటువంటిరోగులను లక్ష్య స్మృల సేయన్ వలెన్. ౨

---

*ఆంధ్రభారతి యను పత్రికనుండి.)

## ప్రాచీన గురుశిష్య పద్ధతి.

శా॥ పెంచీ లక్కలులేదు "గేమ్సు" మొదలౌ "ఫీజుల్" నిసన్ రాపుపోష్టంచున్ నిర్ధనుఁ ద్రోచిపుచ్చరు గురుల్, "పాస్" నైన నే లాభమిం। దంచున్ నేమము లేదు మీ చదువునందాలోక మీలోకమున్ । గాంచన్ వచ్చెడినార్యులార! మిము మెక్కన్ జెల్లు నెకాలమున్॥ 1. ఉ॥ ముక్కల నక్కలం గుఱిచి కొల్లఁ బొల్లగుఱించి కాక మీ । రెక్కడఁ జూచినన్ ద్విజగదీడ్యచరిత్రుని దేవునిన్ మహా । భక్తిక నైప నుతించుసురవాక్కులు శిష్యులకిచ్చి వారి దౌ । వాక్కును దేహమున్ భవముఁ బావనమున్ బొనరింతురొప్పగన్॥ 2. ఉ॥ చెప్పలకాళ్ళ ముండితపు శీర్షము శూన్యలలాటమున్ మఱిన్ । గొప్ప బడాయి వేషములుఁ గుచ్చులపాగలుఁ గోట్లుఁ గంఠమం । దొప్పెడి పట్టముల్ గలుగు నెజ్జలు శిష్యులు నీకు లేరు మా । యప్ప! చిరాయువై బ్రతుకు మమ్మరొ వేదమ! నీకు మ్రొక్కెదన్॥ 3. ఉ॥ చాపలె యాసనంబులఁట; జందెములే వరవారవాణముల్। పాపము పావఁజాలు నదిపట్టులు శాలలు; పుణ్యలోకముల్ । చూపెడి మాలికల్ వాడకుఁ జుట్టిన పట్టము లర్థమిమియే । ప్రాపగు జీత మిట్టి గురువర్యుల శిష్యుల మెక్కుటొప్పదే॥ 4. క॥ ధనవంతులకన్నను ని। ర్ధనవంతులె ప్రీతిపాత్రతములగు శిష్యుల్ । వనమాలిఁ దెల్పు లేటే చదు,వన మాలిమి నెగడు మీకు నంజలి సేతున్॥5. సీ॥ అరుణోదయమ్మగునప్పుడ మేల్కొంచి యాత్మాను సంధాన మాచరించి । ఆపగాదులకేగి యట స్నాన మొనరించి రవి త్రయీమయుని కర్ఘ్యము

### టాటోటురటకుఁడు

ఉ॥ కొట్టి సుహాసహాం బదియుఁ గొండొక కొంకు వహించు నెవ్వనిం
దిట్టఁగ దానిఁ గుట్టునలదీసుని నాలుక్రయు వెనక్రఁ దీయు నా
పుట్టుగు బమ్మచారి యెటు బొంకిన నేమగు? నట్టి చీపురుం
గట్టలు గిలుక్రవాత్రఁతలకు గౌరవ మొక్రడి దమ్మ? శాంకరీ. ౧

మ॥ ఘటచేటీకరనీచకాచకలనాక్రాంతంబు కర్ణద్వయం
బఁటఁ? నానానృతపాతకాంచితవృథాహంకార పంకాంకితం
బఁటఁ? చేతం; బటువంటివాఁ డొకఁడు పేరాసించి టాటోటులన్
రటియింపన్ గటువానుగా కవియు ధీరవ్రాతముల్ చూతురే. ౨

---

లోనంగి। తముఁ బోలివర్తింపఁ దగుశిష్యగణములు వెంబడిరాఁగ గృహంబుఁజేరి నిన్న దండెమ్ము పైనించిన నీరాకవి పుట్టముల్ ధరియించి భూతిదాల్చి॥ తే॥గీ॥ దేవ తార్చన మొనరించి దేవదేవ! నామపూర్వకముగ వేదనాదమును ద, దంగవి జ్ఞానమును శిష్యులనువదింపఁ, గాల మేగించు పూజ్యుల గారవింతు. 6. చం॥ నృ పతులు వచ్చి దూరమున నిల్చి నమస్కృతిఁజేసి పూర్తిగాఁ, దపమును వేచియా పయిని దగ్గఱకుం జనదెంచి 'మీకునే! ది పనిగొ తెల్పుఁడీ యిపుడె తీర్చెద మన్న "మహేమి లోటులే, దపరిమితంబ సౌఖ్య, మనునట్టి తపస్వుల మిమ్ముఁ గొల్చెదన్॥ 7. ఆ. వె. చంకజోలితోడఁ జనుదెంచునట్టివి, ద్యార్థిఁగాంచి బ్రహ్మయరుగుదెంచి, నట్లు సంతసించి యన్నమ్ము పెట్టు ప,తివ్రతా మణుల నుతింతు భక్తి, 8, ఉ. "వారలు మీకు విద్యనిడవారము లేమిడఁజాలమే., యటం, చా అని పేర్మి దేవుగతి నారసి భక్తినిబెట్టి విద్యపైఁ। దీక్షనియాస్థఁ జూపెడి విధివ్రతి మానుల నగ్రహారవుం, బాలుర వారి గేహినులఁ బాయని భక్తి నుతించి మ్రొక్కెదన్॥ 9. శా, ఏరాజుం గన నిచ్చలేమి 'నెటులో యీపొట్టఁ బోషించితే! తీరం గావలె' నంచు భైక్ష్య మది యెంతే శ్లాఘ్యమంచెంచి యా, చారధ బొవ్వ గృహంబు లేగి వెనుకన్ ఛాత్రావళుల్ రాఁగ సం,సారంబీఁదుచు విద్య నేర్పెడి మహా సంస్కర్తలన్ మొక్కెదన్॥ 10. కం॥ భృతకోపాధ్యాయులఁగని, మతిలో నే వమ్మొనరించు మాన్యులకున్ బ్రో, న్నత వేదశాస్త్రవిద్యా, రతులకు నతులిడుదు రాజరాజనతులకున్॥ 11. మ॥ శుచియా వేషము శుద్ధమా మతము సంశుద్ధం

ఉ॥ "ఆవులు దూడలుం గలుగ నార్వులు గుంజల కేల" తా నెవం
డీవిషయంబు నేమెఱుఁగు నింతకుఁ దన్నెవఁ డీసడింపకే
పో విడుచున్ జరిత్ర మన బొంకులు బూతులుఁ గూడనా సుకోని
కావల మేడ? సత్యపుఁ బ్రకార మదేడ?వచింపు మంబికా. 3

ఉ॥ ఇట్టి వృథా ప్రజల్పకుల హీనపు వ్రాతఁలు కీర్తి కామినిం
గట్టుడు నాపె "కాళ్ల కురి గట్టె" నటం చొకమూల నాఁగుచోఁ
బట్టపగంటఁ జూకఁ దలపభావము వెల్గక పోదు "తో డొంగిన్
రొట్టెయుఁ గాకపో దొకనరుం డలతానుహ గాకపోఁ" డిఁకన్. ౪

---

బు దేహం బని। ర్వచనీయం బగుపాండితీగరిమ ద్రవ్యంబం దనాసక్తి పూ। ర్వ
చరిత్రంబులయందు భక్తియును ఛాత్ర శ్రేణిపైరక్తిగ। ల్గుచతుర్వేదుల సాంగులన్
నిరతమున్ లో నెంచి కీర్తించెదన్॥ 12 మ॥ఘను లుద్యోగులు వచ్చి "మీసుతు
నకున్ గన్యామణిన్ మేటులో। ధనధాన్యాదులతో నొసఁగెద" మనన్ దత్క-
న్యఁకైకో మనం। బున నిష్టంబదిలేక "మీరలతులుల్ పూఁబోఁడి మీకన్నె మే।
మనఁగా రిక్తుల" మంచుఁ దప్పికొనుమి మ్మర్పింతుఁ బుష్పమ్ములన్; 13. చ॥ధ
నమును భూమియున్ దమకుఁ దామయి యిచ్చెడిరాజు లుండ "నం। దనులకు
విద్య రాదు ధనధాన్యవశంవదులైన" నంచుఁ గై। కొనక యెటో కుటుంబము
నకున్ భృతి గూర్చు నిస్పృహాత్వమే। ధనముగఁ గాలమున్ గడపు ధన్యులఁ
బూర్వుల నాత్మ నెంచెదన్॥ 14. ఉ॥ రా జరుదెంచునప్పటి కరఁటులతోఁటకు
గొప్ప త్రవ్వ త। మ్మనజనపాలుఁ డొయ్యఁగని। "యార్య! కృతార్థుఁడనైతి
మీకు న్వ। ర్యాభజము లెక్కఁలే దయిన భూమిదొ ద్రివ్యమొ స్వీకరించి మా। తేజ
ముఁ బెంపుఁ" డన్న గణుతింపని సూరుల నాశ్రయించెదన్॥ 16, ఉ॥ "పుట్టితి
మెట్టులో యిచటఁ బుట్టినయూరెటు వీడవచ్చు ని। ప్పట్టున నే వసించి బుధవ
ర్యులఁ జేసెదఁగాక శిష్యులన్। బెట్టెద నేనయన్న" మని పేదతనంబనుకోక
దాతలం। బట్టి స్వశిష్యులన్ బెనుచువారి నుతించి యశంబు బెంచెదన్॥ 17.
ఉ॥ పెట్టెలు లేఖ కల్గినను బీగము నున్న విభూతినంచియే। పట్టుధొకందు భూతి
నిడు బంగరపుంగని గాఁగ రాజరా। జట్టులు శిష్యవర్గమున కన్నము విద్యయు
నిచ్చువేలుపుం। శెట్టుల మద్దురూత్తములఁ జెప్పి మఱొకరి నెట్లు చెప్పెదన్॥

తిరుపతి వేంకటేశ్వరులు.

(గౌతమీనది — సెలయేఱు)

ఉ॥ కొంగలు వ్రీలు బండ లాగిఁ గొట్టుకపోవుచుఁదేల గౌతమీ
చండతరప్రవాహ మది శాశ్వతమై భువిఁ బర్వ నెన్నియో
కొండలనుండి వచ్చి యదిఁగూడ సెలయేఱు లెట నూఱుఁ బేరు లే
కుండఁగ "దివ్యగౌతమిసగస సుందరదీపములో" యనం జొరెన్. ౧

చ॥ అంతన పుట్టు నంతటనె యాఱుఁ గసున్ రయ మొప్పఁ బాఱు నొ
క్కొంత వెడల్పుఁ బొడ్వు గలయే అది యే సెలయేఱు, దానిపై
నెంతయొ సహస్రనామముగ నెల్లపుడున్ బ్రవహించుచున్ బవి
త్రాంతరగమై తనర్చెడి మహానది గౌతమినుండు శాంకరీ ? ౨

---

దుఁగలఁడని 'పరదైవు' సరికెనీవు ప్రతిబోధుఁడ వే,... తే॥గీ॥ నలువదుదుగుము నిన్నును వాసుదేవుఁ, డందరే బుద్ధియుతులు నట్టిని చూసి, సిద్ధమైన వాసుదేవాఖ్య సెల్లెనట్టు, లుర్విలోపలఁ బత్తులఁ దొరఁడు గలఁడె,, క॥ నీచక్రము నీశంఖము, నీచాపము నీగదయు నీఖడ్గంబున్, నీచారోపితములు విను, చూచిన నవ్వుదురు వీని శూరులు ధరణిన్,,...క॥ నవ్వెదు వారల నెఱుఁగవు, క్రొవ్వున నిటు పలికె దేల? గోవిందుని నీ, వెవ్వనిఁ గాఁ దలఁచితివి పతఁ, దువిద్వత్పారదు భవన్మదోద్ధతి యడఁచన్,,.......వ॥...శైనేయుండు (సాత్యకి) అట్టహాసంబు సేసియతనికిట్లనియె ......తే॥ గీ॥ ఆదిదేవునివేకు చిహ్నములు పూని । నంతటనె యాతనికిఁ దుల్యుఁ డంద్రెనిన్ను, సింహాకపటంబు దొడిగినఁ జెనఁటికుక్క, గంధ గజగంధమున కును గలదె నిలువ,,...వ॥ ... పౌండ్రుఁడు...ఒక దూత నాదైత్యదమను పాలి కింబసిచిన,,...సీ॥ ... తిరిగి తంతటఁ బోక తేఁకువ మాలి నా పేరుఁ జిహ్నము లుఁ గన్పించికొంటి, వాసుదేవుఁడన... నేన కా,... బ్రతుక వలతేని వినుము... చక్ర మాటగవిడిచి మత్పాదము జూడిగి, నడికి చనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ,, వ॥ అనియిట్లు దూతముఖంబున వెడలిన విమతువాక్యంబాకర్ణించి ... కమలలోచనుండు వానింగనుంగొని సీ॥ ననునట్లులరుగుదెమ్మనియెఁ గావున నెల్లయుడియాలములతోడ నరుగుదెంతు, వినుతచిహ్నమ్ములు వీడుమన్నాఁడు గావునఁ జక్ర పూర్వతఁ దనరువాని, దనమీఁద విడిచెదఁ, దనశరణముఁజొచ్చి మనుమంటగ లదు గావునఁ గడంగి, తనశరణంబె పెంపొనరంగఁ జొచ్చి నిర్భయుఁడనై భూరి

(చ్యవనమహాముని)

ఉ॥ కొండలు బండలుం గలిసి గొబ్బగ నెంచి స్వపక్షపాత మా
ఖండలుచేతి కత్తి కిడఁగా గరుడుం డిడెఁ బక్షపాతియై
యుండియు నీకమాత్ర, మదియున్ జ్యవనుం డిడఁ, డాత్మశక్తి యి
ట్లుండు నటంచుఁ దెల్పుటకు నోజగదంబ! తృణీకరించుచున్ ౧

క॥ తనబలము నెదిరిబలమును, గననికతన వజ్రి మట్టిఘనహేతియె కీ
ర్తిని గోలుపోయెఁ గొడవ, ల్లనిమొన నటు లాచరింప నది యేమగునో. ౨

---

సంపదహరింతు తే॥ గీ॥ ధరణినెందుఁ బేరగ్గలవాఁడు దాను నాకు, దాఁటవచ్చు
నె తనయాజ్ఞ దడయకింత ,వట్టునేఁడు నెల్లిటిలోన నిట్టులముగఁ, జేయఁగలవాఁ
డనంతయుఁ జెప్పు మీవు,,... వ॥ ...అద్దేవుఁడు దివ్యగంభీరస్వరంబున నతనికి
ట్లనియె,, సీ॥ పౌండ్ర భూవర! నీవు భావమ్మునందు మదీయాంకములు మోవఁది
విరితేని, నాపాలికేతెంచి నమ్రుఁడవై యేను నీవాఁడ నాకిమ్ము నీదుచిహ్నము, ల
నని వేఁడినలలి శాశ్వతంబులై చెల్లునువెట్టివై చెట్ట చేసి. యింకనైన వినీతి నేతెం
చి వేఁడుము ... వ॥'' నీవునన్నరమ్మని దూతచేతఁ జెప్పి పుత్తెంచిన నీదెసవచ్చి
తగినబుద్ధియుం జెప్పితి, నిట్లు సేయుము...అనిపలికినఁ బౌండ్రుండతని కిట్లనియె,,
మ॥ అవనీనాథులనెల్ల నుద్ధతుల గర్వాంధ్యం బడంగింప నేనవతీర్ణుండ, నెఱుంగ
వేయకట! మిథ్యావాసుదేవాహ్వయం, బవినీతిన్ ధరియించి కొందఱకు మోహా
భ్రాంతి పుట్టించెదీ, యవలేపంబు నెఱింగి కాదె నిను దండార్హుండుగాఁ జూ
చితిన్,, తే॥ గీ॥ నాకువెఱచి కైలాస యానంబు పేరఁ, గొంతకాల మున్మొయిఁ
దప్పఁ గ్రుంకిపోయి, తీవు లేకున్నఁ జూవె మహావిభూతి, మెఱయవచ్చెదు నీయా
రనెఱుపనైతి,,...క॥ పగతుఁడు చక్రమువైచిన, నగధరుఁడు సుదర్శనమున న
దితుత్తుమురై, జగతీస్థలిఁ దొరఁగెదు న,ట్లుగఁజేసె సమస్తజగములును ముదమం
దన్,,...వ॥ ఇబ్భంగిఁ జగతు నపగతసమస్త సాధనుంగా నొనర్చి యమ్మహావీ
రుండు. తే॥గీ॥ ఏమిరా! వాసుదేవుఁడ నేనయనుచుఁ, జెప్పి కొనవచ్చునే? యిం
కఁ జెపుమ నాకు,...వ॥...గరుడ చరణ ప్రహారంబులఁ గృత్రిమగరుడలాంఛ
నంబగు తదీయ ధ్వజదండంబు ఖండంబులు సేసి....,, (విస్తరముఱుంగఁ గోరు
వారు హరివంశోత్తరభాగము ౬వఆశ్వాసము చూడఁదగు)

(కాళింగులు)

ఉ॥ అంగమునిండ భూతి నిడి యల్పపువస్త్రము గట్టి చెంబు చే
లం గొని శుద్ధసద్ద్విజులలాగు నటించుచు నెందుఁ బోవు కా
ళింగులపోలికన్ నేఁ డకటా లేకు లనేకు లింకెంత నేరుపెం
దుం గనకే వధానిబిరుదుం దలఁదాల్తు రదేమి పాపమో? ౧

ఉ॥ వేసము పొట్టకోస మిటు వేసిన వేటరుగాక యీరసా
భాసులు నిక్కపుం ద్విజులఁ బట్టుక "మీరును విప్రులె మిముల్
భూసురు లంట తప్పు మముఁ బోరునఁ గెల్చినఁగాని మీకు మీ
భూసురనామ మొప్ప" దని మ్రోఁగుదు రేమిటి కంబ శాంకరీ. ౨

(లూత)

ఉ॥ అంబరమందు *సాలెపురు వాదరు వింతయు లేక ప్రేలుచం
దం బోకయష్ట తోఁచు నది తథ్యమొ? కా దటు మున్నె యల్లియుం
చుం బహుతంతుజాల మది చూరున నంటుక యుండు దాని దా
రంబు మొగంపు దారపుఁ బరంపరతోఁ గలుపున్ వికంబడున్. ౧

ఉ॥ నేయును గాత లూత యది నేర్చిన నేఁతగఁ బొట్టకోస మా
నాయము; బట్టకోసము జనంబు కువిందుని గోరుఁగాని యా
మాయపుఁబుర్వ నేఁత కయి మానస ముంచునె? యుంచుఁబోని యెటో
కాయమునందుఁ గప్పికొనఁగా, నది వచ్చునె? ముట్ట విచ్చునో. ౨

---

*21 వ సెప్టెంబరు 1912 సం॥ కృష్ణాపత్రికనుండి

ఈఁగపులి

తే॥ కీటకములందు మిక్కిలి కీర్తిగంటి। నీఁగపులి యందు రందఱు నేల మి న్నన్నఁ। గాదెయంచును మది వృథా గర్వపడకు। నరసులదివిన్న నసుదురు సాలెపురుగ?, కపటమున నేదొ యొకపన్న గడను బన్ని, యీఁగలను మోసపుచ్చుటే నీఁగపులివి। కాని యెదురుగ నిలఁబడి కలనఁ గెలిచి। పేరుపొందిన దేది రూపింప లూత?। ఎట్టులో యొకరీతి నీకీబిరుదము। కలిగె నామాటలటులుంచు కలిగినంత। మాత్రమున నూర్ణనాభమామదినిమిభులు, తలను దాఁటిన గర్వంబు దాల్పఁదగునె

ఉ॥ అల్లిన దానినే మరల నల్లును, గ్రొత్తవిధాన నల్లఁగాఁ
జెల్లదు సాలెపుర్వునకుఁ జేతయుఁ గా దది యెన్నిసారులే
నల్లినయల్లికే మరల నల్లెడి దానికె నంతనింత మా
యల్లిక యెందుకేని గొఱయైనది గాదుగదా మహేశ్వరీ. ౬

(నీరసాశుఘోషానిరసనము)

చ॥ ఎఱిఁగియు గ్రామ్యపుంగయిత కేమును బాల్పఁడబోదు మేము కొ
ప్పర మొకవేళఁ బోరికి సభాస్థలికిన్ జనుదెంచెనేని; శాం
కరి! యది కాదుకూడదని కంకకుమమ్మ! ప్రసక్తి దీరను
త్తరపు క్షణంబునన్ మరల దానిఁ ద్యజించెద మాజ్ఞ యిమ్మికన్. ౧

చ॥ ఎలమిఁ దురుష్క నిందగిలి యేగిన నాతికిఁ బ్రీతిఁ గొల్ప మా
కల్గుఁడు తురుష్కతాప్తికయి కట్టెఁడిమార్గముఁ బట్టు భంగి నెం
గలులకుఁ బ్రీతిగొల్పఁ గలకాకవితం బురడింప నెంచి క
శ్మలమగు గ్రామ్యఘాటి కొడిసాచెడి తవ్వను నైఁపు మమ్మరో. ౨

ఉ॥ తప్పులఁ దోఁపనీకు మెడఁదంగలశాస్త్రము గప్పిపుచ్చు మే
చొప్పున నూదడాబిడిగఁ జూప్పశలాకలఁ బోలు పద్దెముల్
గుప్పఁగఁ జేయు మెయ్యెడలఁ గొంకు ఘటింపకు మెట్లొ నూఱులన్
జెప్పినదే మహాపదవి నేయుము మాయుము గ్రామ్యశక్తముల్ ౩

ఉ॥ కష్టముగా నెటో భవదఖండకృపామహిమమ్ము కల్మి నీ
ముష్టికవిత్వమధ్యమున ముద్దులు మూటలుగట్టఁ జాలు ని

నీవరాక్రమమునకును నీయశముకు! నీదుబిరుదంబునకు లోన నీవుమెచ్చ! వలయు నీజాతివార్మెచ్చ వలయుఁగాక! యింక నెవ్వరుమెత్తురో యీఁగలవులి!, యెన్నెరో గొప్పకీటము లున్నవి సుమి! వానికేమియు గర్వంబు గానఁబడదు, వెదకి రవ్వంత యల్లికల్లుదువో లేదో! మేలు నీదు గర్వము పట్టఁజాలకుండెఁ, జాలునింతటి నుంచైన సాలెపురుగ?, బుద్ధి తెచ్చుకొని నయాన బుజముతెగర! వైచి కొనుటచాలించి గర్వంబువిడిచి! భద్రముగనుండు మిదియు నీబ్రతుకు తెరువు.

పిప్పర సోదరకవులు

ర్దుష్టపుఁ బద్యమున్న నది తొల్లి రచించిన దండ్రు, వారి సం
తుష్టికి నట్లు గాదనుచుఁ దోఁపఁగఁ జేయుట యెట్లు శాంకరీ. ౪

ఉ॥ గిరగిరఁ ద్రిప్పమోఁ గెడిఁ బకీరుకరమ్మున నొక్క యంత్ర, మా
"కిరకిర,, బాలురన్ దనుపఁ గీలొక్కనుభంగియొ మాన్యమైన చోఁ
బరపరలాడుచున్ గవితఁ బాడెద డాబిడిగా నటంచుఁ బా
మరులు నుతించుపూనికయు మాన్యతఁ గాంచుఁ గదే మహేశ్వరీ. ౫

మ॥ స్వరవర్జ్యత్వమెఱుంగకే పోరిఁబోరిన్ సంగీతముల్ వాడి యె
వ్వరు మెప్పింతురు! గాయకోత్తములు వహ్వా నాఁగ; నట్లే పర
స్వరసందర్భము శ్రోత్రపేయతయు సౌశబ్ద్యంబు లే కెట్టులో
విగచింపన్ గవితల్ శ్రవోయుగళికిన్ వింతల్ ప్రసాదించునే. ౬

చ॥ "పదనిస, సాని దానిపస, పస్రీసరి, గామగారిసా,
సదగద, నీరిసారి, దరిసా, గరిసా, నిరిసా, రిపా, రిసా,
గదగద, పాదపాద, సపగా, పదగా, నిదగా, దగా, దగా,"
యిది యొక గానమేని యెదియేనిఁ గవిత్వ మగున్ మహేశ్వగీ. ౭

ఉ॥ "చేసినదోసముల్ బయలు సేయఁగ నెంతువె! దుష్కవిత్వ వి
న్యాసము బైటఁబెట్టుటకునై గమకించెదవేల" యంచు దే
వాసురయుద్ధముల్ గెలిచినట్టిఁడు పండితరాజు చేత నీ
వీప డిలంగఁజేసి మము నెందుకు దూర్చెద వింక శాంకరీ. ౮

ఉ॥ ఎంచి పురాదులైన పదునెన్మిది వర్ణ్యములం గుఱించి వ
ర్ణించి కథానుగుణ్యముగ నించి రచించిరె యుంచి రంచుఁ బ్ర
శ్నించినచో సదుత్తరము చెప్పుటకున్ దగవైన యుక్తి దోఁ
పించి యనంతరమ్ము నడిపించుమి యీకృతి కోమహేశ్వరీ. ౯

చ॥ కవివరులెల్ల మేలనఁగ గ్రంథములన్ రచియించి కప్రిపుం
జపుల జగమ్ము మంచెడి ప్రశంస ఘటించియు నేఁడు కొప్రిపుం
గవులకతమ్మునన్ రసము గన్పడకుండెడి దిక్కుమాలు కా
కవితకు మమ్ముఁ బాలుపడఁగా నొనరించెదె మాలదైవమా. ౧౦

చ॥ గడియకు మూడువందలఁటా? గంటకు డెబ్బదివందలంటా! త
ప్పదుకవనమ్ము చెప్పుటకుఁ బూనినవారిని బుట్టఁజేసి యె
ప్పుడు నరసాశుకవనమున్ బచరించు మదీయవక్త్రమున్
"బడబడ" మ్రోఁగు "తాషమరపా" నొనరించెదవమ్మ యీశ్వరీ. ౧౧

ఉ॥ వృత్తవిశేషముల్ చెడి వివేకము పోకముదప్పి సద్గుణా
యత్తతఁ దక్కి శయ్య యొకఁ డంతగఁ బొంతగ నంగ్రహించి యే
పొత్తును రోయకే పలుకుపోకడ నేరిపి మాదుకైత ను
న్మత్తతమైఁ జరించుక ఘుమాలగఁ జేసెదె మాలదైవమా. ౧౨

చ॥ తారతార గ్రామనామములు తొంబదియో పదియో సహస్రమో
పరపర గుక్కతిప్పకయె వాగెడి విప్రవినోదివై ఖరిన్
జరచర నోరు జార్చుటది సత్కవిధర్మము గాదటంచు నీ
వెఱిఁగియు దానికై మనము నేటికిఁ గొల్పెదవమ్మ శాంకరీ. ౧౩

ఉ॥ అక్కటా? నీరసాశువున నందముఁ జందము లేక యెట్టులో
గుక్కిళ్లు మ్రింగుచున్ వెడఁగు గొల్లలసుద్దుల నెంతపాడినన్
దక్కునె "కైత" యన్ పదవిదానికి, "గాడిదగంపెఁడూఁక దాఁ
బొక్కిన నేమిలాభ"మగు బొంకక తెల్పఁగదమ్మ శాంకరీ. ౧౪

ఉ॥ అబ్బెన మేల నేయవలె నంబరొ? తంబుర, యొంటికంటి త
బ్బిబ్బు మృదంగ,మీద్వయమె వేషమువట్టిన లోటు గాని యా
బొబ్బిలిపాటగాంద్రతలఁపుం గొలువంగల పాడుకైతమున్
నిబ్బరి గల్గి పండితులచే నుతిగాంచెడి కోర్కె యున్నచోన్ ౧౫

చ॥ కవితయుఁగాని సంతతియుఁగాని జనించిన యుత్తరక్షణం
బవిసి నశించెనేని ఫలమబ్బునె? గర్భభరమ్ము దక్కఁ, నా
యువు లవమేని లేనిసుతు లొక్క సహస్రము కెప్పపాటులో
శివ! శివ! పుట్టనేమి యగుఁ జెప్పఁగదమ్మ, మదంబ, శాంకరీ. ౧౬

ఉ॥ ఆశుకవిత్వమందు రస మారయ రాశని యప్ప సెప్ప నో
యీశకుటుంబినీ! జననమే లిఖియించిన బంతిక్రింద నే

నాశముఁగూడ వ్రాయుటది నల్వకు నమ్మత మౌనుగాక గ
ర్భాశయమే స్రవించుటకు నక్కట! దీనికి భేదముండునే, ౧౮

ఉ॥ “మారుని నేరఁజాలు సుకుమారుఁడు, కన్నులు చేరెఁడేసి, బం
గారము మే”నటంచు స్మృతి గాంచిన బాలున కేడ్చుభంగి వి
స్తారరసమ్ము గల్గుటయు సంభవమందెడుఁగాక నిల్వఁగా
నేరని క్రొవ్వహాళుకవి నేరుపులేటికి మాకు శాంకరీ, ౧౯

చ॥ పలుకుల కల్కి నేర్పిన సుభాషితముల్ జతఁజేసి కచ్ఛపిన్
బలుకఁగఁ జేయ దానికి నుపశ్రుతిగా శ్రుతివిందు సేయుచున్
గలకలలాడు కంకణవిక స్వరసుస్వర మట్టులుండు మా
పలుకులొనర్చదే యనుపబాడిగ బండరవంబు లీశ్వరీ. ౨౦

చ॥ కలుషితమైన నీ స్వరసు గాఁ బ్రవహించెడునట్టి తప్పఁగై
తలదొరలున్ దడాబిడిగఁ; వజ్ఞుల కెట్లు రుచింపనౌ, శర
ల్లలితకలావిలాసవిమలమ్ములు సత్క్రమలంబులో, రస
జ్ఞులకు గుచించునట్టిద యగున్ హిత మాశుకవిత్వ మేరికిన్. ౨౧

‡(తలకుఁదగనివ్రాఁతలు)

మ॥ కవితాతత్త్వరహస్యవేత్తృతకునై కష్టించునుత్కృష్టు వి
ష్టవివేకుల్ కులగోత్రనిందకులు, వేదాచారపారంపరీ
దవవహ్నుల్, సకలాన్నభోక్తలు, సమస్తస్త్రీకుటుంబుల్, మహా
సువివేకుల్, వితరీత మీ తెలివి విజ్ఞుల్ రోయ కెట్లుందురే
కవులివ్వారి గణింత్రురే వీరలౌకా లోకం బన్నానేఁ డంబికా. ౧

‡(మే 10 వ తేది 1913 వ సం॥ కృష్ణాపత్రికనుండి)

# చరణాయుధప్రశంస.

ఒకభాషాభిమాని:—

ఈ పోట్లాటకు అంతంలేకుండా ఉన్నది. ఈకవులు కోళ్ళనుగూడా మించిపోయినారు. తురుష్క యుద్ధమైనా ముగిసేటట్లున్నది. కాని యీకవుల కలహ మెప్పుడారంభమైనదో దానికి విసుగు విరామము లేకుండా ఉన్నది. అంత

ఉ॥ దుర్మతముల్ కడుం బ్రబలి తొందర గొల్పెడుపట్లు, ధర్మపు
న్మర్మ మెఱుంగునార్యు లవి మాపినయట్లె కవిత్వతత్త్వవి
త్కర్ములు లాఁగఁగా వలెఁ గుకావ్యము; తాదృశధర్మకార్య మే
కర్మ మెఱుంగఁ జాలనియకర్మపరుల్ నిరసింప నేమగున్. ౨

ఉ॥ జన్మము లాఁగి పోయెనొ? యశస్సుల సత్రము లాఁగిపోయెనో?
అన్నము మాల మాదిగల దండలకుం బ్రియమై తనర్చెనో?
దున్నల కాలు భార్య లయి తోసము నందెనొ? ప్రోడ శిష్టసం
పన్నగృహస్థపుత్రికరపంకజ మంటెనొ? వీరియార్యులన్. ౩

ఉ॥ ఏనది కాదు కాని దగు నం చది దేశము నుద్ధరించు నం
చేనరమాత్రులో గిలుకునేవపు వ్రాఁతల కూఁతమై యశో
ధీనులఁ బూర్వపండితగతి న్మతిఁ జొన్పెడి జ్ఞానులన్ మహా
ధీనిధులన్ వృథా దెగడు తెల్వులవిల్వల నెంచ నేటికిన్. ౪

---

కంతకు కక్షలు ప్రబలుతున్నాయి. ఇరుపక్షములచుట్టు గ్రామసింహాలు చేరి గర్జనము మొదలు పెట్టినాయి. ఈపోట్లాటల నాపించే ప్రభువెవడుకనపడడు! వీటివిషయమై ఆంధ్రపత్రికలు జాబులు ప్రకటించకూడదని దొరతనము వారొకచట్టం చేస్తే బాగుండును. కవులకే బుద్ధిలేనప్పుడు నావంటివారేమి చేయగలరు?

(మే 15 వ తేదీ 1913 వ సం॥ సుదర్శనీ పత్రికనుండి)

## కవులకలహములు.

గతవారపు కృష్ణా పత్రికలో కవుల కలహములను గూర్చి విచిత్ర చిత్రావళిలో నొక చిత్రము ముద్రింపఁబడినది. అందు రెండుతలల కోళ్లు రెండు ముఖాముఖిగా నిలువఁబడి యుద్ధము చేయుచున్నటులను ఇరుప్రక్కలను శునకములు అఱచుచున్నట్లును చిత్రింపఁ బడియున్నది. ఇది చూచుటకు మిగుల నచ్చెరువుగానే కనపట్టుచున్నది. గాని కొంచెము దీర్ఘదృష్టితోఁ జూడఁగా మిక్కిలి జుగుప్సాకరముగఁ బర్యవసించు చున్నదని తెలుపుటకుఁ జింతిల్లుచున్నారము. ఈ జంటతలల కోళ్లరూపముతో నున్న కవులెవరో యెల్లరును జెప్పకయే తెలిసికొనఁగలరు. ఇంత కాలమునుండి వీరిట్లు వాదోపవాదములు చేసుకొనుచుండఁగా నింతవఱకెవరి కేమి యనర్థము కలిగినదో చెప్పఁగలరా? వైదిక నియోగికక్షలు పెరుఁ

తే॥ గీ॥ జననమరణాలలీస్టు విస్తరమొనర్ప, నవతరించినయయ్యలేయగుదురొక్క
పండితులటన్నఁ గవులన్నఁ బ్రాజ్ఞులన్నఁ, బత్రికలు వ్రాయువ్రాఁతలప్పగిది గాక

తే॥ గీ॥ బుద్ధిలేదంటిరి కవులకు బుద్ధి గల్గు, వారలిఁక నెవ్వరో యీకులాచారములను
సున్నచుట్టైడి మేటిసంపన్నులొక్కొ? వీరలు నిగర్వులపు గన్నలేరు జనని.

శా॥ కవికలహాప్రచారములు కట్టఁడులన్ గరఁగింప లేవు కో
ళ్లపుడురు వారికిన్ సుకవు; లన్యులు కొందఱు కుక్కలౌదు రీ
యవినయమున్ సహింపనిగుణాఢ్యుల కీలిఖియించు ప్రాజ్ఞులే
మపుడురో? నీ వెఱుంగని రహస్యములుం గలవే మహేశ్వరీ. ౭

గీ॥ కోడిగ్రుడ్డంతయన్నమ్ము గొసరెనొకఁడు, నిమ్మకాయంతగోరెసత్సమ్మతుండు
వేఱొకఁడు; దీనఁగలసువివేకమజ్ఞు, లెఱుఁగ రది విజ్ఞులకుఁగాక యెట్లు తెలియు

---

గుచున్నవందురా? ఆ పాప మింతయు మూలమున నే పండలేదు. అది యిది వఱకే పండి బ్రద్దలయినది ... ఈ తారతమ్యచర్చ ప్రతివిషయములోనను గలుగుచుండును... "నిరంకుశాఃకవయః" అనునట్లు వారిలోవారు చర్చచేసుకొనుచుండఁగా నడుమవారు వారిని గోళ్ళతోడను గుక్కలతోడను బోల్పఁజూచుట యనాలోచితము... కోళ్లు, కుక్కలు మొదలగు నీచోపమలచే వారిని బ్రజారంగమునఁ బడవేయుటకంటెఁ గొదమసింగములఁగానో మదగజములఁగానో ప్రదర్శించినచో సత్యమైన యర్హమయిన గౌరవమయిన ప్రదర్శనమయియుండును... మఱియు వీరిట్లు నీచోపమలచేఁ జిత్రరూపమునఁ బ్రదర్శించుటయేకాక దానివ్యాఖ్యానములో "ఈకవులకు బుద్ధిలేదు. ఇత్యాది పరమతృణీకారనీచవాక్యములచేఁగూడ సంభావించిరి.

(1913 వ సం॥ రం॥ జూన్ నెల 15 వ తేదీ సుదర్శనీపత్రికనుండి)

ఇప్పుడు వివాద పడుచున్న కవియుగ్మములను గూర్చి కృష్ణాపత్రికలోఁగోళ్లుగను గుక్కలుగను పరమనీచోపమగాఁ జిత్రించఁగా వర్తమాన కవులలో గౌరవనీయులయి యున్నవారి నింత నీచపఱచుట చాలజుగుప్సాకరముగ నున్నదని మేము వ్రాసినది పురస్కరించుకొని "కవులు కలహింపవలెనఁట" యను వ్యాసమొకటి సువర్ణలేఖ యొక చదివరి పేరిటఁ బ్రకటించెను... అంత కంటెను అధికులు చర్చించు కొనుచుందురేని వారి ప్రశంసయే యెత్తుకొనము. ఎందుచేత? వారి

మ॥ ఉపమాకల్పనఁ బట్టి కాల్పనికునం దూహింపఁగా వచ్చు ని
క్కపుసౌభాగ్యము లెన్నియేని; యది యజ్ఞగ్రాహ్య మెట్లో? వృథా
కుపితుల్ తోఁచినయట్లు గిల్కుదురు సంకోచింప రల్లంత న
య్యపలాపంబు సదోవిగర్హితముగా నద్దెంతు రజ్ఞత్వమున్, ౯

ఉ॥ అజ్ఞుల వ్రాఁతలే ప్రకటనార్హములౌనఁటె? త్యాజ్యముల్ మహా
విజ్ఞుల వ్రాఁత లౌనఁటె? వివేకులు కోళ్లఁటె? కుక్కలంటె? ధ
ర్మజ్ఞత మేలుమేలి? లిదియు బ్రహ్మసమాజమతప్రపత్తిన
ర్వజ్ఞతయొక్కొ? యన్యమతవర్తుల కంబరొ? యింత జ్ఞానమే, ౧౦

---

వివాదము తీర్చుటకు మనమెంత మన బ్రతుకెంత యనెడు స్వసామర్థ్య దౌర్బ
ల్యమును బట్టి మన త్రోవను మనము పోవుదుము. టర్కీ బాల్కను రాష్ట్రముల
మహాప్రవిదారణము సంధిచేయ బ్రిటిషు ప్రభుత్వమువంటి వారికే యర్హత గల
దుగాని యెలమంచిలి ప్రొప్రయిటర్లు, ఏమిచేయఁగలరు? ...ప్రస్తావనకవు లేతనా
త్రులుగారు. కలమెట్లు చేతఁబట్టవలెనో తెలియని "చదువరి' ప్రభృత్యస్మద్వ
శులందఱును వంక దొరకెఁగదా యని యెద్దియో యనిష్ట కారణమున వారిని దోఁ
చినట్లెల్ల నీచపఱచుట కధికారము లేదు....చమత్కారముగా యుక్తిప్రయుక్తిక
ముగా వాదములు చేయుచున్నారు. సొంపు చెడినట్లు మధ్యస్థులకుఁ దోఁచుటలేదు
ఇష్టములేనివారు వారివాదములను బ్రకటించక పోవచ్చును,...వీరికి నిజముగాఁ
గవులు కలహించి పాడయి పోవుచున్నారని పరితాపమూ లేక వారిలో నెవ్వరియం
దేని యనిష్ట కారణమున నేదేని వంకఁబెట్టి యేవో వెకిలి "రిమార్కు"లు చేసి
తద్ద్వారమున నయినఁ దమయనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమా?...తొలుత
రామకృష్ణకవులు తమకీశ్వర వేరులన్నమాట వినగానే తిరుపతి వెంకటేశ్వరులు
'గ్రుడ్డివచ్చి పిల్లను వెక్కిరించినందుకై'' కంటగించుకొని కొంచెముద్ఘోషణము
చేసిరి. ఇట్లె గుంటూరిశతావధానములోఁ గొప్పరపుకవిగారికిఁ దమ రంగస్థల
ములోఁ దమతో సముఁడన్న సిద్ధాంతము మీఁద సహాసన మీఁయగా నట్లువలదనిరి.
లోకసామాన్యమర్యాదకై మీరెట్టి యాసనమిచ్చినను మాయభ్యంతరము లేదు గాని
ప్రత్యేకించి మాతో సముఁడన్న సిద్ధాంతముపైయాసనమిచ్చిన మేమంగీకరింపమనిరి.

ఇందు దప్పేమియున్నదో? సన్యసించి తపమాచరించుకొను వారికైనను నీవు

సీ॥ అమ్మ యెంతటిధన్యురాలో యీబిడ రజస్వల యయ్యుమొగియదిప్పటికిఁ బెండ్లి,
కితనియోగ్యతనెన్న నెవనిశక్యము పెండ్లియాడె నల్వదియేండ్లయాఁడుఁ బడుచు
నా పెనఁసరణపరాయణత్వము మిన్న యాఁ బుత్రవతి పెండ్లియాడె విధవ,
అతఁ డిందఱకన్న నధికుఁ డేమన? జందెమునుద్రెంచె బాలుఁడైనను దెగించి
తే॥గీ॥ ఇట్లు ధర్మేతరములనే యెపుడు వినుతి, సల్పుపత్రిక లెక్కడ? సహజధర్మ
బద్ధ బుద్ధికిఁ గాని కన్పడని సత్య, మనెడిపరమార్థ మెక్కడ? యఖిలజనని.

---

కొలఁది వాఁడ వందుమేని యాతఁడూరకోఁడే! అట్టియెడ మానుషము విడనాడని లౌకికకవిమాత్రులు సగౌరవ న్యూనతా పరాభవము నెట్లు సహించఁగలరు... కాఁబట్టి సర్వవిధములను ఏవంకనో తమ యనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశమే యీ పరితాపమునకుఁ గారణమని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును... ఈ హృదయకల్మషముల కొక్క ప్రబల దృష్టాంత మిచ్చుచున్నాము చిత్తగించుఁడు... నిన్నటి సువర్ణ లేఖలో..."ఓర్వలేక తగవులాడు కవులను జుట్టుజుట్టు ముడిపెట్టి ఇనుప గాలములు వేసి లాగుచున్నారండో? శ్రీరామరామ'' యనునొక సందర్భములేని యపలాపమును వ్రాయించినారు..."కవులను'' ప్రత్యేకించి నిర్దేశమేల చేయవలెను? కవులనే కాని, యోర్వలేనిగుణము గలయితరుల నెవ్వరిని శిక్షింపరాయేమి?... లెడుబీటరుదొరగారు చెప్పినట్లు కామము దీర్చుకొనుటకు అకృత్య మెంత యుపయోగమో క్రోధము దీర్చుకొనుటకిదియు నంతియయుపయోగము. ఈయముపట వర్ణనము విధాయకమే గనుక ఓర్వలేక తగవులాడు కవుల నొక్కరినే కాక యాగణములోని వారినందఱనుగూడ నాలోకముసఁ జిత్రవధ చేయుట తప్పనిసరియని తెలియఁ జేయుచున్నాము. కలహించఁ గూడ దను వీరిసిద్ధాంతమే సర్వదా ఆచరణీయ మగునేనియు, నట్టివారినెల్ల నే కోళ్లగనో యేమక్కలుగనో చిత్రించ వలసి యుండునేనియు నిప్పటివఱ కనేకవిషయములలోఁ గలహించుచు వచ్చిన కవులు, విమర్శకులు, పత్రికాధిపతులు, పండితులు, సంఘసంస్కర్తలు, పూర్వాచార పరాయణులు మున్నగుమహామహులనందఱ నీవిధముసఁ గోళ్ళు, కుక్కలు, పిల్లులు, పందులు, గాడిదెలు,గాఁ గూడవరుసగాఁ జిత్రించి వారికి బుద్ధిగఱపుచుండవలెననియుఁ దెలియఁజేయుచున్నాము. ముందుని ఘ్నేశ్వరపూజగాఁ దొలినాఁటికలహకవులయిన దండి కాళిదాసులను జెటేయె

సీ॥ ఘనుని బట్టుక నీచజనుఁ డేది వ్రాసిన నది శిరమ్మునఁ దాల్చునట్టిఘనులు
నీచునినీచత నిక్కమ్ముగాఁ దెల్పువారి వ్రాఁతలు బుట్ట వైచుఘనులు
సత్యమ్ము నెఱిఁగియు శాంతులపోలిక నొప్పరికించుపరిపాటి నురుఁగుఘనులు
ఏదియో పోట్లాట నూఁదినఁ బత్రిక కబ్బ "మేట''రటంచు నరయుఘనులు॥

తే॥గీ॥ పత్రికాధిపతిత్వంబుఁ బడసిరేని, దాసివలనను గల్గెడుహాని జగతి
కెంత యవి చెప్పఁగలము లోకైకజనని, సత్యమునుఁ గంటునెగడు నసత్యమెందు

---

## కథాప్రారంభము.

వ॥ అంబా! దీనికేమి ప్రకృతవృత్తాంతమ్మవధరింపుము,

(సూర్యోదయము).

మ॥ పరితస్సర్పదపారభాస్వరగవీపారంపరీసన్నుతై
మిరభారుండు దివాకరుండు త్రిజగన్మిత్రుండు మందేహాధి
కరణోద్యోగి వెలింగె నార్యులు "కృతఘ్నఘ్నాయ దేవాయ" యం
చరఁగన్ దనకరకోటి కాలాకలఁది నెందేఁ బందలై సాఁచఁగన్. ౧

చ॥ సరసిరుహాప్తుపాదములు సారెకు నుప్పరమందు, నెంగుఁ గొ
ప్పరపు శిరమ్ములందు నొగిఁ బ్రాఁకి ఘనాలయ పంక్తి మీఁదుగా
ధరణికి డిగ్గి యెల్లెడలఁ దామసు యామెయి వారిశైత్యపుం
భర వటఁజేయుచున్ నెగడెఁ బండితపామరరంజకమ్ములై. ౨

---

కఱుకగను వారికిఁదగఁ బుదీర్చిన దేవి సొక యాఁడుపందిగను జిత్రించి యది కొదలు మొన్నటిప్రజకుఁ దగవులాడిన శిష్ట్లకృష్ణమూర్తి, పిండిప్రోలులక్ష్మణకవి, వెంకటరత్న శర్మగారు, వీరేశలింగం పంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యగారు, వడ్డాది సుబ్బారాయఁడు గారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు, మున్నగువారి నందఱను వారివారి యర్హతకుఁ దగిన జంతువులతోఁ బోల్చి చిత్రించుదురుగాక, అపూర్వోపనిషన్మతము వెలయింత్రుగాక.

(కొప్పరపువారు కాలుద్రవ్వుట)

చ॥ దురుసుగ నుండె నుత్తరపుధోరణి యుత్తరుగత్తరంబలెన్
ద్వరపడి తిట్టి బందుగులదాపునఁ దూలుట స్పష్టమయ్యె నె
త్తఱి నెటఁ జేయనట్టి *యవధానము నెత్తుట వీర్వలాయన
స్థిరు లని యెంతమూర్ఖునకుఁ జెప్పక చెప్పఁ దొడంగె నంబికా. ౧

క॥ అలనూజివీట శ్రీకా, కుళమున మఱికొన్నిచోట్లఁ గోవిదు లెఱుఁగన్
జలిపిన ప్రత్యేకపుసభ, లలవా రెఱుఁగమియు స్పష్టమై కన్పట్టెన్ ౨

‡క॥ ససహాయంబుగ నవధా, నసభన్ బొనరించునట్టి నరుఁడె ఘనుఁడో తా
నసహాయుఁడు ఘనుఁడో యది, సుసుమలకుం దెలియునే ఘనులకుం దక్కన్. ౩

$క॥ తెలుఁగఁటె? మీసంబఁటె? అది, నిలుపన్ వలెనంటె? వీరు నేరుతురొక్కొ
తెలుఁ, గౌరా? తెలుఁగనఁగాఁ, దెలగాల్మాటాడు పద్యతెలుఁగే యగునా. ౪

తే॥ బళిర? యీవార్త తెలుఁగెల్లఁ బాటిమీఁదిపందికొక్కులబల"మన్నపగిదిదోఁచె
వీరికి జవాబొసంగుట విజ్ఞులొప్ప, రయిన సామాన్యలోకు లట్లనరుగాక. ౫

క॥ అని యెంచి వారు పద్దెము, లను గిలుకన్ మేము వానిలక్షణమును నే
రనిపోల్కి స్వవచనమున జా,బును బంపితి మంబ? వారు పురఁబురఁ బొక్కన్

క॥ పద్దెములు వ్రాసితిమి వి, ద్వద్దశ గూపెట్ట మనము పలుచనగా వా
రద్దె మిటు గొట్టిరని యో, గుద్దుకొనం దొడఁగి రంట? కొప్రపుసాముల్. ౭

---

*బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులకు......

సీ॥ ... ... అష్టావధానంబు నాచరించెదరేని యద్దానిమించి సేయంగ లేము, శతఘంటకవనంబు, సల్పఁబూనెదరేని యద్దానిమించి సేయంగలేము...

‡ గీ॥ అన్యునిసహాయ మించుకయైన లేక. పద్యమవధానమందు జెప్పంగ లేని, మీమహాధారణాశక్తి......

$ ......తెలుఁగు మీసంబు నిలుపంగ దివురుడింక. (2(-8-11)

§ మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బారాయ కవిగారికి. అయ్యా! పద్యమయంబగు తమయుత్తరమందినది, "మీపరువును మాపుమాటకు జవాబు నొసంగిన వాఁడ నవుచ్చుఁడి" అని వ్రాయించినారు. ఏసందర్భమునం దేవిషయమునం

క॥ మనరామకృష్ణులకుఁ జ, క్కనిపద్దెమ్ములను వ్రాసి ఘనత నొసఁగి రి
య్యనువున మనలం జూచిరి, యని లోలో నగచిరంటి యాత్రింపుఁగవుల్,

క॥ అనుకొంటి మేము వీరికి, ననవద్యపుఫక్కి వచన మైనన్ వ్రాయం
జనద, యది గ్రామ్యశైలిం, బనుపను టే యుక్తమనుచుఁ బదపడి జననీ. ౯

క॥ కాని యటు మొదట యోజన, మానసమునఁ దవులకునిక్క మఱి యాధాటిన్
బూని లిఖియింప మైతిమి, దానికె యక్కవుల కెడఁద తబ్బిబ్బయ్యెన్. ౧౦

క॥ తగినంతగూఢ గతిమే, మగుపఱచిన వీరికర్థ మగు టెట్లటు వ్రా
యఁగ నర్థము తముఁగోరఁగ, నగరాజకుమారి! వీరి నగరాని విజ్ఞుల్. ౧౧

సీ॥ అవి యనద్వావహామ్ములన, “మాకు నిత్యమి
య్యదియె కూర” కటన్న దెవరు జననీ?
ఒక్కరో? యిర్వరొక్కో? దేవు లనుకేలి
“కెద్దు”లంచనుకొన్న దెవరు జననీ?
“లవణం బనిన నేదొ యావలికిఁ జని తెచ్చి
యెలమి వడ్డించిన దెవరు జననీ?
సభ “నథాతో బ్రహ్మ' చదువ “సీతాత” లో
నపప్రసంగము నేసి రెవరు జననీ?

గీ॥ వారిలో వారు గారొ క్రొంపువారు, కాక యుండిన గీత మొక్కతన వృత్త
మయ్యె వీరికి నీలాటి యథముశుభము, నెఱుఁగని యమాయికులు మీస లెత్త నేల.

క॥ ఇది యిట్టు లుండె మాజా, బది వారికిఁ జేరె మరల నలవార్తాబున్
గుదురుచుకొను నీలోపలఁ, బొదలిన వేఱొక విశేషమున్ విను మంబా, ౧౩

(మ॥ రా॥ రా॥ ఏకా రామయ్యపంతులుగారింట విందు)

ఉ॥ ఇంతకుమున్నె విందనుచు నెల్లబుధుల్ విన రామయార్యుఁ డే
నంతసమానియో పిలిచెఁ జట్టన నాఁడె నియోగివైదిక

---

చేరూపముగా మాయేమాట మీయేవరువును మాపినదో యావిషయము విపులముగా వ్రాయించినంగాని మీకుఁదగిన యుత్తరమిచ్చుటకు వీలులేదు. కావున వెంట నే దయచేసి పై విషయమును వ్రాయింతురుగాత.— 21-8-11.

ఇట్లు, దివాకర్ల తిరుపతిశాస్త్రి.

స్వాంతము లెత్తఁ బాఱఁ గొనసాగని యాసనచర్చకల్మి, ధీ
మంతుఁ డితండు మున్ననిన మాటకు దాఁటక వచ్చి చెప్పెరన్. ౧౪

ఉ॥ నేఁ డరుదెంతుమన్న నుడి నిక్కము సర్వుఁ డటంచుఁ బిల్చి మో
మోడిన త్రోవ గన్పడఁగ నొయ్యన నయ్యనఘుండు వోయె "బోఁ
గూడదు కూడు" నంచు నొకకొందఱు దండడిఁ జర్చఁజేసి రా
పాడి గడింప "కేగుటయె బా" గనె వెంకన నిర్విశంకుఁడై. ౧౫

ఉ॥ విం దనుకూలమై జరిగె విందున లోప మొకింత లేద, యొం
దెందుల కేని మంచి దని యెంచిరొ యేమొ, మఱొక్క పంక్తి మా
కుం దమవారి కందఱకుఁ గొండొకపంక్తియుఁ గాఁగ నేరుపా
టుం దగఁ జేసి రయ్యది కడున్ సుఖ మిచ్చె ననేకభంగులన్. ౧౬

ఉ॥ పట్టురుమాల్ బుజమ్ములపయి బాలరవిప్రభలీనఁ బంక్తికిన్
రాట్టయి యగ్రపీఠమున రాజిలెఁ గొప్రిశు సుబ్బారావు, బల్
దట్టులు మండపాటికులధన్యుఁడు లోనగువార లాతనిం
బట్టి క్రమమ్ముగా నతనిపంక్తి నెసంగి రభంగురస్థితిన్. ౧౭

తే॥ గీ॥ జరిగె నారీతి విందు ప్రశస్తగరిమ, భోజనానంతరమ్మున నోజఁ గొంద
ఱేగుదెంచిరి వారు కోటీశశర్మ, శాస్త్రిముఖ్యులు పదపటిచర్య వినుము. ౧౮

మ॥ చిఱుమామిళ్లకులుండు యోగ్యుఁ డలలక్ష్మీపూర్వనారాయణుం
డురుకీర్తిస్థవిరుండు వచ్చె నట కుద్యోగిత్వమైత్రిన్, ధురం
ధరులై తక్కిన చుట్టలున్ మఱియునుం దక్కుంగలా రొప్ప భా
స్వర మయ్యెన్ దగుపాటిగా సభ భవిష్యచ్చర్య సూచించుచున్. ౧౯

శా॥ ఏకారామయగారి తమ్ములఁట బీ,యే,బీ,యలై ప్లీడరీ
దాఁకన్ వచ్చిన మేటియంట! మఱి యా ధన్యుండు తాంబూలముల్
వీఁకన్ గొన్ని ఫలమ్ములుం గొని సభన్ వీక్షించి తాఁ బంచె నా
పోకల్ కొండొక వర్ణనీయము లనం బోలుంజుమీ శాంకరీ. ౨౦

ఉ॥ ముందు భుజంగరాయనృపమూర్తికొ, కొ్రప్పుటయ్యకో, ఫలగ
బందఁగఁ జేసి యాపిదప నన్యులు బందుల కిచ్చి మీఁద న

స్పందితకీర్తి కంఘ్రిజనిభాస్వరుఁ డౌనలమేటి కీయ నా
విం దతఁ డందకే కదు వివేకి మమున్ గరసంజ్ఞఁ జూపుచున్. ౨౧

ఉ॥ రామయగారితమ్ముఁ డలరారెడియోగ్యతఁ బొల్చువాఁడు సు
శ్రీమహితుండు లక్ష్మినరసింహసమాఖ్యుఁడు మా కొసంగెఁ ద
ద్ధీమహితత్వమేమి, మఱి తేఁకువయేమి మది న్నుతించుచున్
బ్రేమ ఫలమ్ము వెంకన పరిగ్రహణం బొనరించెఁ గ్రన్ననన్. ౨౨

చ॥ తిరుపతి పుచ్చుకోక యొకతేఁకువ దాని ననాదరింపఁగాఁ
గరము మదిన్ దలంచి యటు కర్జమునన్ గుశలత్వ మూనె, నం
తరమునఁ బత్త్రదాత యది తా గ్రహియించె నొకింత చర్చయున్
సరసముగా నెసంగె నది సభ్య లెఱింగినదే మహేశ్వరీ. ౨౩

ఉ॥ రామయగారికిన్ మఱియు రామయతమ్ముఁడుగారికిన్ గడున్
ధీమహితత్వమందునను దేఁకువయందును గల్గువారకున్
మామదిఁ జర్చ సల్పుచుఁ గ్రమమ్ముగ వచ్చినత్రోవ నింటి కే
మేమియు చెప్పి కొంచుఁ దగ నేగితి మానిని వోయి నీగతిన్. ౨౪

చ॥ వెలవెలవోయెఁ జుక్కలు వివేకవిహీనులమోములట్లు ని
ర్మలసలిలాశయంబులు ప్రమోద మెఱుంగని వారి మానసం
బులబలెఁ దెల్వి మీఱె ఘనపుణ్యులు వైదికులు న్నిరోగులున్
గలిసి యొనంగునర్ఘ్యములు గైకొనుచుండె దివాకరుం డొగిన్. ౨౫

మ॥ అది వర్షర్తువుగాన మేఘపటలం బావంత దగ్గప్పఁ గో
విదమాన్యుండు దివాకరుండు తనగో విస్ఫూర్తిచే జ్ఞానిదు
ర్మదముంబోలె నపాకరించి సుదినశ్రీఖ్యాతి యవ్వేళకున్
గడియన్ వెల్గఁదొడంగెఁ గాకవితతుల్ గ్రాసార్థ మట్టాడఁగన్. ౨౬

క॥ తరువాతఁ దనదు సొమ్మగు "గురుతరలీల" యనుపదముగొని పద్యంబున్
బురపుర లిఖించి మీసము, స్మరియించుచుఁ గొప్పగంపు చతురుఁడు వెలుచన్

ఉ॥ *పత్రిక నంపి యప్పుడును బద్యము వ్రాయక యుత్తరించుచూ
పత్రికఁ జూచి "వీర్నకుఁ బద్దెము వ్రాయమిఁ జూడ" నేటి కీ

---

*మహారాజశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకు......చ॥ గురుతరలీలరేపె సభ
గూర్పఁగ నుంటిమి గాని, భానువా|సరమున దక్క రారవరు,...ఆశుకవిత్వశోభ

యాత్రము మీరు మాకుఁ గవులేయని తోఁచరు మీరు తిట్టినన్
శత్రుత మాకుఁ బుట్టదనుచందముగా మదిలోఁ దలంచుచున్. ౨౮

క॥ పదపడి*వచనము వ్రాయుచుఁ, బదిదినుకం బత్రికలకు దాడఁగెన్ సుకవుల్
పదుగురుగల సభయనన, వైదర్భోరాయివడి వ్రాఁతలెల్లన్ సురిఁగెన్ ౨౯

క॥ †తటిమితటిమి మునుమ్రాకు, త్తరములు లిఖియించునతని తత్తఱమూపై
విఱిగి సురిఁగి కరిగెనోయి, త్తరమే వచ్చుటకు మిగులఁ దడవైపోయెన్. ౩౦

---

ధానముల్। విరచన సేయ రాఁ గలయు, వెంటనె, మేమవియాచరించి ధీ। వరసభమీ ప్రతిజ్ఞ దెలుపం గలమీసము దీయఁజేతుము ..."

గుంటూరు, 22-8-11.

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బారాయశర్మ, శతావధాని.

---

గుంటూరు, 23-8-11.

*మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి. అయ్యా, ...మీన పుఁ బద్యమున కర్థమే కారణమునను మీకుఁ దెలియలేదనుకొనియెదను ... తెలియదేని పెద్దలనడుగుఁడు... (4) ఈప్రతిజ్ఞ ప్రస్తుతవిషయము కాకపోయినను మీయంతట మీరు పురస్కరించుకొని వివాదమునకు దిగుటచే నయ్యది యింతటినుండి మీయెడలఁగూడ నిర్వహించుట కంగీకరింపక తప్పినది కాదు....(9) మీరు మాకుఁ దెలిసిన యంశములలో నేకదేశప్రవిష్టులు మాత్రమేయయినను మీకోరికంబట్టి మీ సభకు రా నుద్యోగింతుమే యనుకొనుఁడు రేపిఁక నొక రాంధ్రభాషైకదేశమగు గ్రామ్యభాషయందుఁగాని నిర్యతిగణప్రాసస్వాశబ్ద్యరసాభాసకవిమార్గమునంగాని యనృతరీతిఁగాని మమ్ముజయింపుఁడని కాలుదువ్వినచో మాగ్రహచారమందుకు నొడఁబడవలసినదేనా! అందులకుఁ బ్రాజ్ఞులు సమ్మతింపవలసినదేనా! మాకుఁగల శక్తులలో నేకైకదేశమునంతో యింతో యెంతో యెఱిఁగినవారెల్ల మమ్మాదరింపఁదగువారేనా! శాంతంపాపం...(12) ఈవ్రాఁతవలనఁ దెలుఁగు నేని మీకు వదలితి మని యనుకొనకుఁడు...."

---

గుంటూరు, 27-8-11.

†మ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి, అయ్యా,(1)జరూ

క॥ లలి "బాజానందడి మంగళ సూత్రము మఱచినట్లు". గా సభకై ముఁ
గలికిన రవివాసర మా, పలికిన్ జని వచ్చె సోమవాసర మంతన్. ౩౧

చ॥ సభయగునన్న యాదినము నందడిగా జను లేగుదేర రా
సభ మయి పోయె నెయ్యెడల సందుల గొందుల వంటపూటియుం
డ్లు భరముగా జనుల్ విడిసి "డాబులు డాబిరి యేలనేయరో
సభ" యని కొ్రపుంగవుల సారెకుఁ గేరఁ దొడంగి రంబికా. ౩౨

సీ॥ పుట్టదిట్టము లేదు పోనీ నిల్చు టెట్లు కొప్పరమంచుఁ బలుమాఱు పలుకువారు,
తన్నుఁ గట్టులబల్మి తనయున్నతిని నిల్పు నెంతదన ఘనటంచు నెంచువారు,

---

రు "అని 25 వ తేదీని మేము వ్రాసిన యుత్తరమునకు 27 వ తేదీ 11 గంటలకు మీ రిచ్చిన జవాబు అందది... ౧. సభ ముందుమీరే చేయవలెను, ముందుత్తరము వ్రాసి యవధానాశుకవిత్వములకై కాలుద్రవ్వినవారు మీరు కాని మేము కాము, ...౨. మావిషయమై మీరును మీవిషయమై మేమును నవధానపు టేర్పాటులు చేసికోవలసిన దే కాని యయ్యవి సభ్యులేర్పఱుపఁదగినవి కావు, ఉభయులచే నేర్పఱచికొనఁబడిన సభ్యులు న్యాయాన్యాయములును రసారసములును దారతమ్యములును విచారింపఁదగినవారు మాత్రమే ౩. ఈవిషయముల కంగీకరించుచు మీరుసభ సమకూర్పఁడు, లేదా మేము సమకూర్చెదము...౪. జరూరని వ్రాసినను వెనుకటి వలెనే ఆలస్యము చేయక రేపు సూర్యోదయమునకుఁ దప్పక జవాబు పంపవలెను.

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

---

ఉదయం 8 గంటలకు 28-8-11, గుంటూరు,

అయ్యా! ఈదినమున సభ తప్పక జరుగు ననుమీప్రకటనను బురస్కరించుకొని యనేకు లనేకగ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు. వారిని వృథాశుల నొనరించుట యుచితము కాదు కావున నవధానసభావిషయ మేమయినదియుఁ బ్రకటించి వారిసందియము తీర్పఁడు మాయుత్తరమునకుఁ బ్రత్యుత్తరము రాకుండఁగనే మేము ప్రకటించుట యుక్తము కాదుగదా?

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

తన్మానుబంధలే తన్నువంచనసేయ నవసరంబైనప్పు డనెడువారు,
నేల విడిచిసాము లేలొకోని యొకచోట నంతలోనే యుంచక నెడివారు ౩౩

తే॥గీ॥ వింధ్యగర్వంబగస్త్యునవంధ్యమహిమ, మ్రుగ్గడించి యినీని యనియెంచలువారు
హంసకాకచరిత్ర మిష్టంబటకుసు, స్మృతికిఁ దగిలె నటంచు వచించువారు.

మ॥ ఒకటే శైలిగ నొక్కటే పడిగ నూహొయారి యంచుఁ గవ్యగ్రణీ
ప్రకరం బెంచఁగ నంచ యేగె, నటుఁ "రార"మ్మన్న కాకంబు ము
న్నొకతీ, రావయి నొక్కతీరు, వయినెన్నో తీరులైడన్ని, నూ
టొకయానమ్ములు చూపి కాదె శరణం బొందెన్ మరాళప్రభున్. ౩౪

క॥ అనిపూర్వగాథలెన్నుచు, మనమునఁ దమపడినశ్రమకు మతిమతి విసుఖం
గనుచుఁ దిరిగిపోనెంచుచుఁ. బునఃపునర్యోజనలకు బుద్ధి చొనుపుచున్.

ఆ॥ వె॥ కొండవీటిసామిదండ నుండెడిలేడి, కొండ కేనిమూఁతుగుఱ్ఱమునకుఁ
దఱచుభయము చెందిదండంబులిడునొయ, ద్దానితోడఁ బెనఁగుతలఁపు గొనునొ.

తే॥ గీ॥ సింహాగమనంబు నేర్వంగఁ జిన్నిలేడి, కెన్నిజన్మమ్ములెత్తినయేనిగలదె
పాల్యపాలకభావసంబంధ ముడుపఁ; దలఁచుటదియెంతయేనియుఁ దప్పిదంబు.

క॥ తన పాదములు మనమ్మన, ననయము మననమ్మ నల్పునప్పటికిన్ దాఁ
గనికరము కరము గని దా, నిని మురువ్వగఁ జూడకున్న నేరము హరిదా. ౩౮

క॥ హరికిన్ హరిణమునకు నం, గర మది హాస్యాస్పదంబు గా దనువా రుం
డరు దానికేమి హరిణము, కరి నెదురై యంద మెట్లు ఘటియించునటుల్.

ఉ॥ రంకువు శీఘ్రగామియని రాజులు పట్టపుటేన్గు వీడి రా
జ్యాంకము గాఁగఁ గైకొనిరె యక్కటని యేనుఁగుతోడఁ బోర నా
జింకకు శక్తియున్నదెని ప్రసిద్ధికినై "యెదిరింపు"మంచు నే
కొంకును లేనివారు పురికల్పినమాత్రన యేమిలాభమో. ౪౦

చ॥ అదులక భేద్యమైన చతురంగబలమ్ములు గల్గుకేనితో
గొఱియలగొల్లకేఁ డెదురుకోలు ఘటింపఁగ నెంచి "మీరలున్
గొఱియలతోనె రండనుచుఁ గోరిన "నీ" యని రోసి దానికే
"సరి" యని సిద్ధపడ్డ, పెడబాబుష రాబుల డాబు లేటికో. ౪౧

ఉ॥ ఇచ్చి వరమ్ము గైకొనరె యెల్లసురారులకు న్నిలింపు; లా
సచ్చరితుల్ మహామహు లసన్మదహారులతో గ్రహఁ బట్టి వా
రిచ్చిన మెచ్చు లాగికొనుటేమి యపూర్వము? మెచ్చినంత నే
హెచ్చును దగ్గునన్ వలదె? తల దాటిన పోక లొప్పునే. ౪౨

శా॥ దేవ బ్రాహ్మణవృత్తులన్ విడిచి వర్తింపన్ నిరోధించి భూ
దేవుల్ వీడుదు రాలపోతు నది భూదేవాజ్ఞకుం దక్కె దు
ర్భావం బౌతఱి నూరకుండరు గదా? పైవచ్చుచో నెవ్వరిం
గావంజాతురెరీ? కావలం బడఁపరే? కాల్ప్రివ్వఁ గా నిత్తురే. ౪౩

ఉ॥ చెక్కిలి నొక్కుచున్ జనులు చేఁపఁగ ముద్దిడుకొంచుఁ బేర్మిమై
నక్కునఁ జేర్చుకొన్న సమయమ్మున బాలుఁడు పాలు గ్రోలుచున్
ముక్కు "కటుక్కునన్" గొఱుక ముద్దిడియుల్లను మూలఁబట్టె నా
యక్క "ఇదేమిరోరి చెడుగా" యనదో నమొ? దానరోసమే. ౪౪

చ॥ వితతతరప్రబంధముల విశ్వజనీనములన్ రచించి కీ
ర్తి జగమెల్ల ముంచుచుఁ జరించెడితిర్పతివేంకటేశ్వరున్
మతిచెడి కొప్రిపుంగవుల మాయకవిత్వముతోడఁ బోరికిన్
గుతుకము పూనినా రని జనుల్ విని నవ్వరె మొగమ్మునన్. ౪౫

ఉ॥ అల్లిక కేమి సాలెపురు వల్లదె? 'హు' ప్పని యూఁదునంతలోఁ
బొల్లగు నల్లికల్ సరిగ బుద్బుదముల్ గదె? దీని కేసుదృ
క్తల్లజు చిత్తమేనియు యథార్థముగా ముదమందునే? యొటో
యల్లిన దేల కాదనఁగ నంచది మే, లను టొక్కమెచ్చకో. ౪౬

ఉ॥ ముంగలివాని యుద్ధము క్రమమ్మున మున్నరచించినట్టివే
ముంగలి కీడ్చి పాఠమును బొఖ్ఖగ నప్పఁగఁజెప్ప శిష్యుపో
ల్కింగడు ఘాటిగాఁ జదివి కేవల మొక్కఁడొ యొక్క టొక్క టో
జంగయితంబు సెప్పట యశస్కరమే? సుకవీంద్ర సత్యమే, ౪౭

ఉ॥ విప్రవినోదినంచి నెటు వేఱొక వస్తువు లుండు నట్టులే
కొప్రపువారు నంచి నిడుకొందురు వర్ణన లన్ని చేసి, యా

శుపరిష్కృతిన్ రచించి రని శుద్ధు లమాయికు లంద్రు మర్మముల్
సుప్రథితుల్ గ్రహింతు రిది చూచిరి పట్టి రనేకు లెల్లెడన్. ౪౮
ఉ॥ గుట్టిది బైటఁబెట్టుటకుఁ గొందఱెఱింగియు సంశయింతు రీ
చెట్ట నడంపకున్న నెటు చేటు దొలంగునొ? సుహాకవిత్వ వి
ద్ఘట్టసుధానథామకవితానవతామరసాననావచః
పట్టణవైభవప్రథితబంధురసౌధవిలాసలక్ష్మికిన్. ౪౯
ఉ॥ జీవనమూడె మాకని వచింతురుగా కొకకొంద ఱట్టి వా
రేవగనైన జీవనము నీవయిఁ జేతురుగాక నైత యే
కావలెనేని మఱొకఁగతి గానఁగరాదె, యమాయి కాత్ములన్
జీవికకై జగం బపహసించునటుల్ గికురింపఁ జెల్లునే. ౫౦
చ॥ ఇటులొక కొంతమందిఁ కడు నెల్లిదపుంగతి దోఁప నాడ న
ప్పటుమతు లాడుపల్కు లలపక్షమువారు సహింప "కేల యీ
కటువులు? కొంగ్రపుంగవు లఖండులు వారల శక్తి చూడుఁ, డు
తగ్గట మది, గోరతం బనెడి కావ్యమునం దగుపట్టు నావుడున్. ౫౧
ఉ॥ అప్పగమేశ్వరీ దయకు నాకరులన్ గదలించి దానిచే
గొప్పను గోరి గర్తమునఁ గూలి యెటో పయిరాఁగడంగి యీ
కప్పలరావముల్ కొఱయుఁగా వని లోనఁ దపించి పోకుమీ
కొప్పరపుంగవీశులకు గోరతమే హితమెన్ని భంగులన్. ౫౨
చ॥ అనుటయు వారిపక్షపు జనావళి వారలయోడు పూర్తిగా
మనమునఁ బట్టియుంట మఱుమాట వచింపక యూరకుండ వ
చ్చిన జనసంఘమందలి ప్రసిద్ధులు కొందఱు కొప్పరంపువా
రిని గని కొన్ని మాటలను రేఁగగనేగెద మంచు నెంచుచున్. ౫౩
క॥ చనుచుండ వారిపక్షమ్మున వా రొకకొంద ఱాఁగి మొగి నేమేమో
యన మొదలిడ 'మీరెవ్వరని?, చనుఁడా,'మేమడుగ నటకుఁ జనవలెననుచున్.
శా॥ కాలిం ద్రివ్వితి రూరకుండెదరె? సంస్కారుల్ జగ మ్మందు,వే
వేలున్నా రలవారిఁ గోరికొనుఁ డావిద్యాంసు లేతెంచి మీ
మీలోపమ్ముల నేర్పరించెదరు సాక్షిమ్మ్రరి కెవ్వారికిన్
మీలో తెల్పెద రీసుడిన్ వినఁగ నువ్విళ్లూరెడిన్ లోకముల్. ౫౫

క॥ తిరుపతి యెట్టిదియో? కొ, ప్పర పెట్టిదియో కవిత్వభర మెట్టిదో? సం
స్కారణం బెట్టిదియో? ధి, క్కారణం బెట్టిదియొ? తెల్పఁ గల రెవ్వరల్.

చ॥ పరు వెటువంటిదో? చెలుచు బాసయు నెట్టిదొ? లేశమేని సం
స్కారణము పూజ్య మయ్యె సరిగంగలనాడుట యెట్టిదో? సమ
స్ఫురణకు నానసమ్ము నెడఁ బోరెడిధీరత లెట్టివొక్కొ? వి
ష్టరము లోనంగు పెట్టిదియొ సత్కవితా వనితా వినోదముల్. ౫౭

ఉ॥ కోరిక యెట్టిదో? యచటఁ గొం కుదయింపమి యెట్టిదో? పరి
ష్కారము లెట్టివొక్కొ? మమకారము లెట్టివొ? యంతఁ బోక ధి
క్కారము లెట్టివో? పయివికారము లెట్టివొ? బారుబూరలం
కారము లెట్టివొక్కొ? యధికారమ దెట్టిదొ? కార మెట్టిదో. ౫౮

ఉ॥ సారము లెట్టివో? పయి నసారము లెట్టివొ? కాలుద్రవ్వు ఝుం
కారము లెట్టివో? పయిఁ జకారము లెట్టివొ? యంతలో భళ
క్కారము లెట్టివో? మఱి నికారము లెట్టివొ? పిమ్మటం దిర
స్కారము లెట్టివో? పొరిఁ జూకారము లెట్టివొ? కాఱు లెట్టివో. ౫౯

ఉ॥ చీరము లెట్టివో? తిరుగు చేతము లెట్టివొ? పిమ్మట న్నమ
స్కారము లెట్టివో? పయిప్రకారము లెట్టివొ? యాపయిన్ వష
ట్కారము లెట్టివో? పయి నకారము లెట్టివొ? మీదుమీద నా
కారము లెట్టివొక్కొ? సుడికారము లెట్టివొ? వైర మెట్టిదో. ౬౦

ఉ॥ హారము లెట్టివొక్కొ? వ్యవహారము లెట్టివియొక్కొ? యాచమ
త్కారము లెటివొక్కొ? బయికారము లెట్టివియొక్కొ? పై బహి
ష్కారము లెట్టివొక్కొ? యుపకారము లెట్టివియొక్కొ? యాయహం
కారము లెట్టివొక్కొ? యపకారము లెట్టివొ? నేర మెట్టివో? ౬౧

ఉ॥ పాగము లెట్టివొక్కొ? పయివారలసూరత లెట్టివొక్కొ? స్వీ
కారము లెట్టివొక్కొ? గుణకారము లెట్టివొ? చుట్టుసున్న ప్రా
కారము లెట్టివో? పలు లకారము లెట్టివొ? చాటు చాటు స
త్కారము లెట్టివో? తెలుపఁ గాంగలవారలు పండితుల్ గదా. ౬౨

చ॥ కవి యన నెట్టిఁడో? కవిత గాఁ దగునట్టిది యెట్టిదో? వృథా
రవణము లెట్టివో? కవులరావము లెట్టివొ? సత్కవీశ్వరో
త్సవ చరితము లెట్టివొ? బుధత్వ మదెట్టిదొ? యేరి కేరికిన్
శివ? శివ? సామ్య మెట్టిదియొ? చెప్పఁ గలారు బుధోత్తముల్ గదా. ౬౩

చ॥ ఎవరును నేను నొక్కఁడెడ నెల్లరు మెచ్చఁగఁ గూరుచున్న నె
ప్పుడు నెకొ! యేరికిం దగదొ? యక్కట? శక్తులు పట్టి చూచి "వీ
రక్కవు లలవారలో! కవులు గాఁ దగువార"లటంచుఁ దెల్పఁగా
నెవరితరంబు? పండితకవీంద్రులదక్క జగత్త్రయమ్మునన్. ౬౪

ఉ॥ రా మనిరొక్కఁ! పండితులు, రమ్మని కోరనె లేదొ? సద్యశః
కాములు మీరు వారిపయిఁ గా లటు ద్రిప్పి యుపేక్ష సేయఁగా
నేమి! వృథాగ లోకమున కింత పరిశ్రమ మేల పెట్టినా
రీమెయి నూరకుంట తగునే! యని కంకెవ మంచుఁ బోవుచో. ౬౫

ఉ॥ ఏమిది! యీజనంబునకు నింతటిపక్షము వారియందుఁ, ద
న్నామము వీరి కింతగ మనమ్మున కెక్కఁగ నేల! కొవ్రిపు
న్నామము కోపపాత్రముగ నాటగ నేల! స్వదేశవాసు లన్
ప్రేమముగూడఁ గన్పడ దరిప్రికరమ్మును మించి రీప్రిజల్. ౬౬

చ॥ అని మనమందు నెంచుకొని యవ్వలి పక్షపువారు "మీరు వ
చ్చిన పనిచూచిపోవుటకుఁ, జెప్పెడిమాటలు పెద్దమాట, లే
ర్లును లయి మీకుఁ గట్టములు గప్పెదరి? రింతటి కంఠశోషకుం
బని గనుపట్ట" దంచు నుడువన్ "బని లేనిదె వచ్చినారమే. ౬౭

మ॥ కవితావాద మటన్నఁ జూచుటకునై కష్టించి యీసత్సభా
సువిశేషంబుల నాలకించుటకు నచ్చోనుండి యిచ్చోటికిన్
జవసత్త్వమ్ములు వెచ్చఁ బెట్టుకొని రాఁ జన్నే! వృథావాంకృతి
స్థవిరుల్ సించినపత్రికల్ గని యథార్థం బంచు నూహించుచున్. ౬౮

మ॥ అది గా కూరక వ్యాఘ్రముమం గవులా గంతంత మిట్టెక్క నె
మ్మదికి నెన్నమ్మది దక్క మీసములపై మాత్సర్యముం గ్రక్క సా

గద యంచుఁ దల ద్రుక్కి పాటుకవులన్ గన్గొనఁ జనఁ రాదె! యే
మిది! మీవూనిక యెందు డిందె!' నని పేర్మిన్ బల్కఁగాఁ గూడదే ఉఁ

చ॥ అడిగెద మేము మీ మ్మెడుగుఁ దట్టులె మమ్మెను మీ, రటన్న వే
నృడమి యదెట్టిదో? కపటపద్ధతు లుద్ధదు లెట్టివాకొ! యా
గడబిడ లేమి యయ్యెనుకొ? కా లటు ద్రవ్వ టదేడ కేగెనో!
మడమలు ద్రొక్కి మీసమును మట్టునదావదు లేడ డాఁగెనో. ౨౦

ఉ॥ "మీసము" లంచు మీసములమీఁదికిఁ బోవుటె కాక వారియ
ర్ధాసనమందుఁ జేరుటకు నాసన మూఁచుటె కాక యెన్నియో
దోసపు బాసలన్ గిలికి దుందుడు కందుటె కాక పై రసా
భాసము చేసి పాటు టిది భావ్యమె కొవ్వగపుంగవీశ్వరుల్. ౨౧

చ॥ సమరము చూచి ఖేచరులు సంబర మందుట యెందు వింద మ
య్యమరులబోలె సభ్యులు జయాపజయార్థులు గాక వారు ప్రి
శ్నము లిడ నెవ్వ "రద్దుఁడు వసన్ గనుఁ డద్దెద' మంచు వారు స
క్రమముగ వ్రాయ నందులకుఁ గాక పరాఙ్ముఖులైతి రేటికో. ౨౨

ఉ॥ క్రుద్ధైనఁ టాంజనేయుఁడొక గుద్దును రావణుఁ బట్టె, మూర్ఛమై
నద్దివిజారి జాతి తెలి నంది "బళీ" యని మెచ్చెనంటివి యా
సుద్దికి నంజనాసుతుఁడు సుంతయు నంతన మంద 'కౌర? నా
గుద్దురుచిన్ వచించు టోనఁగూడెనుగా?' యని పంచె వక్త్రమున్. ౨౩

ఉ॥ "మానము" లన్న "జూ" ట్లనుచు మిమ్మెను వా రన వచ్చుఁగాదె! యే
వానియు లేనివారియెడఁ బంతము ప్రాజ్ఞుల కేలకో మీర సా
భానవు వాక్యతయె తెలువుఁ బండితధూరు లటంచు; నస్వభా
వోనము మీది, మీ రిఁక నెఱుంగక చేసెడి దేమి కైనరుల్. ౨౪

చ॥ "గురుతరలీల" పద్య'మది కో! యని యార్చుచునుండె మీరె పై
బరు విడుకొన్నవారలు సభం బొనరించుట కంచు, నేల యీ
పిటికితనంబు నెప్పఁ డని బిట్టుసుగన్ వలె నంచుఁ బోయి కొ
వ్వరవుకవుల్ కనంబడక వచ్చిరి వా ర్త్రముఁ జూడ నంబరో. ౨౫

చ॥ ఆవు దొకచోట విందునకునై చనియుంటిమి మేము మానినా
సవదము చూచి వీరలును జాతిరో! యని యాడుకొంచు న
ట్టిపనియు నుండునే! యనుచు, డీకొని కొట్టెడిసేనపోల్కి న
య్యపరిమితప్రజానిచయ మయ్యెడకే చనుదెంచె నంతటన్. ౨౬

శా॥ అందుం గొందఱు బ్రాహ్మణుల్ మఱియు వైశ్యశ్రేష్ఠులుం గమ్మనా
రెందుం గన్పడి రిందఱున్ గవితకై యేతెంచుటం జేసి యం
దం దించించుక గోష్ఠి గల్గుటను మేయం బయ్యె నూయంబ! మే
మెందు న్శ్రద్ధనియుండ మిందఱును దాదృక్శక్తిసంపన్నులన్. ౨౭

ఉ॥ నాలవజాతియందలిజనంబులు తూర్పున సుంద్రుడు గాని యీ
నాలవజాతి వేఱు పయి నాగరికత్వము మాట కేమి వి
ద్యాలయములన్స్ప్రాణముల నర్పణ చేసెడిపాటిభక్తులుం
జాలఁ గలారు కమ్మకులజన్ములలో శతమున్ సహస్రమున్. ౨౮

ఉ॥ చారలు నన్యులుం గడు నవారిగ వీథికి రెండుప్రక్కలన్
బారులు గట్టి నిల్చి యిటు వచ్చుట, క్రొవపువారిఁ జూడఁ గాఁ
గోరికతోడ నేగి తమకున్ మఱి వారగుపట్టమిన్ వృథా
యై రహిఁ గిండ్లకున్ మరలు టాదిగ నెందఱొ రులాడుకొం చొగెన్. ౨౯

శా॥ అయ్యా! తిర్పతివెంకటేశ్వరులు! మే మత్యాశపై వేడ్క మీ
కయ్యంపున్ సభఁ జూడ వచ్చితి మిటన్, గా ల్బ్రిద్విషా రెవ్వ రా
యయ్యల్ మోమును జాటు వెట్టి రిఁక మా యాయాసముల్ వ్యర్థమే
యయ్యెన్, వచ్చినత్రోవఁ బోవుదుమొ, లేదా? యుందుమో? తెల్పుఁడీ. ౩౦

చ॥ ఎఱుఁగుదు మేము "కొప్పర" మదెట్టిదొ? వారిని జూడ రాము, మి
మ్మెఱుఁగము మీదుపొత్తముల నింపెసలారు "ఫొటోలు" దక్క నేఁ
డరసితి మయ్యె ధన్యము ఫవాదిక; మూరక పొమ్మటందురో?
దరిసెన మిచ్చి నందులకుఁ దగ్గఫలం బొసఁగం దలంతురో. ౩౧

చ॥ అనుచు ననేకభంగుల జనావళి మాపయిఁ గల్గుప్రేమమున్
నువఁడగ జేయుచున్, బలుకఁగా నభుడేము వసించుసౌధ మె

గద యంచుఁ దల గ్రుక్కి పాటుకవులన్ గన్గొంచఁ జనన్ రాదె! యే
మిది! మీపూనిక యెందు డిందె!' నని పేర్మిన్ బల్కఁగాఁ గూడదే. ౧౯

చ॥ అడిగెద మేము మి; మ్మ్రుడుగుఁ డట్టులె మమ్మ్రను మీ, రటన్న వె
న్బడమి యదెట్టిదో? కపటపద్ధతు లుద్ధతు లెట్టివో క్రా! యా
గడబిడ లేమి యయ్యెనుకొ? కాలటు ద్రవ్వట దేడ కేగెనో!
మడఁతులు ద్రొక్కి మీసమును మట్టునడావడు లేడ డాఁగెనో. ౨౦

ఉ॥ "మీసము" లంచు మీసములమీఁదికిఁ బోవుటె కాక వారియు
త్థానసమందుఁ జేరుటకు నాసన మూఁచుటె కాక యెన్నియో
దోసపు బాసలన్ గిలికి దుందుడు కందుటె కాక సైపరసా
భాసము చేసి పాలుటిది భావ్యమె కొస్సగపుంగవీశ్వరుల్. ౨౧

చ॥ సమరము చూచి ఖేచరులు సంబర మందుట యెందు విందు మ
య్యమరులుతోలె సభ్యులు జయాపజయార్థులు గాక వారు ప్రి
శ్నము లిడ నెవ్వ "రగ్గుఁడు వనన్ గనుఁ డగ్గెద' మంచు వారు న
క్రమముగ వ్రాయ నందులకుఁ గాక పరాఙ్ముఖులైతి రేటికో. ౨౨

ఉ॥ గ్రుద్దె నఁటాంజనేయుఁ డొకగుద్దును రావణుఁ బట్టి, మూర్ఛనై
నద్దివిజారి జాతి తెలి నంది "బళీ" యని మెచ్చెనంటవే యా
సుద్దికి నంజనాసుతుఁడు సుంతయు నంతన మంద 'కౌర! నా
గుద్దురుచిన్ వచించు టొనఁగూడెను గా? యని పంచె వక్త్రమున్. ౨౩

ఉ॥ "మానము" లన్న "జూ" ట్టనుచు మిమ్మ్రను వారన వచ్చుఁగాదె! యే
వాసియు లేనివారియెడఁ బంతము పాజ్ఞుల కేలనే మీరసా
భాసపువాఁతయె తెలుపుఁ బండితధూరు లటంచు; నర్వభా
షానము మీది, మీ రిఁక నెఱుంగక చేసెడి దేమి కైనరుల్. ౨౪

చ॥ "గురుతరలీల" పద్య'మది కో! యని యార్చుచున్నసుండె మీరె పై
బడి విడుకొన్నవారలు సభం బొనరించుట కంచు, నేల యీ
విపరీతనంబు నెవ్వఁ డని బిట్టడుగన్ పలె నంచుఁ బోయి కొ
వ్వరపుకవుల్ కనంబడక వచ్చిరి వార్త్రముఁ జూడ నంబరో. ౨౫

చ॥ ఆవు దాకచోట విందునకునై చనియుంటిమి మేము మానినా
సపదము చూచి వీరలును జాతిరొక్కో! యని యాడుకొంచు న
ట్టిపనియు నుందునే! యనుచు, డీకొని కొట్టెడిసేన పోల్కి న
య్యపరిమితప్రజానిచయ మయ్యెడకే చనుదెంచె నంతటన్. ౨౬

శా॥ అందుం గొందఱు బ్రాహ్మణుల్ మఱియు వైశ్యశ్రేష్ఠులుం గమ్మనా
రెందుం గన్పడి రిందఱున్ గవితకై యేతెంచుటం జేసి యం
దం దించించుక గోష్ఠి గల్గు టనుమేయం బయ్యె నోయంబ! మే
మెందు న్మత్తనియుండ మిందఱను దాదృగ్భక్తిసంపన్నులన్. ౨౭

ఉ॥ నాలవజాతియందలిజనంబులు తూర్పున సంద్రదు గాని యీ
నాలవజాతివారు పయి నాగరికత్వము మాట కేమి వి
ద్యాలయములన్నఁ బ్రాణముల నర్పణ చేసెడిపాటిభక్తులుం
జాలఁ గలారు కమ్మకులజన్ములలో శతముల్ సహస్రముల్. ౨౮

ఉ॥ చారలు నన్యులుం గడు నవారిగ వీధిక రెండువక్కలన్
బారులు గట్టి నిల్చి యిటు వచ్చుట, కొత్తవారిఁ జూడఁగాఁ
గోరికతోడ నేగి తమకున్ మఱి వారగువట్టమిన్ వృథా
యై రహింగండ్లకున్ మరలు. టాదిగ నొండొరులాడుకొంచు బోగిరే. ౨౯

శా॥ అయ్యా! తిర్పతివెంకటేశ్వరులు! మే మత్యాశతో వేడ్కన్ మీ
కయ్యంపున్ సభఁ జూడ వచ్చితి మిటన్, గా ద్రివిద్వా రెవ్వరా
యయ్యల్ మోమును జాటు వెట్టిరిఁక మా యాయాసముల్ వ్యర్థమే
యయ్యెన్, వచ్చినత్రోవఁ బోవుదమొ, లేదా? యుందుమో? తెల్పుఁడీ. ౩౦

చ॥ ఎఱుఁగుదు మేము "కొవ్వర' మదెట్టిదొ? వారిని జూడ రాము, మి
మ్మెఱుఁగము మీదుపాత్రముల నింపెసలారు "ఘాటోలు" దక్కనేఁ
డరసితి మయ్యె ధన్యము భవాదిక; మూరక పొమ్మటందురో?
దరిసెన మిచ్చి నందులకుఁ దగ్గఫలం బొసఁగం దలంతురో. ౩౧

చ॥ అనుచు ననేకభంగుల జనావళి భాషయుఁ గల్గుప్రేమమున్
నుపఁడగ జేయుచున్, బలుకఁగా నపుడేము వసించుసౌధ మె

య్యన డిగి నాటకాలయమునం దొకపేటిసభన్ బొనర్చి నే
ర్చినగతి వారికిన్ గలుగఁ జేసితి మగ్గల మైన మోదమున్. ౮౩

సీ॥ "తిరుపతివేంకటేశ్వరులఁ జూచితి" మంచుఁ బలుమాఱు సంతసంపడెడివారు,
ఉవ్విళ్లూరుచు లేచి యొక్కదండముగీలఁ బడి నమస్కారము లిడెడివారు,
కొప్పింపువార లీగొడవఁ దెచ్చుట మేలె యయ్యెఁబోని యని పేర్మినాడువారు,
కయ్యంపుసభఁ జూడఁగలభాగ్య మిఁక లేదు వారుసాఁగిరటంచు దూఱువారు

గీ॥ పాటఁ కేమి యొనర్తురు వారికున్న, సరుకు నెఱుఁగ మెయని చర్చసలుపువారు
వినచోఁ గాలు ద్రివ్వనేలనెడివారు, అడుగుమవ్వారి నటకేగుమనెడువారు.

ఉ॥ అన్నిట వీరిదృష్టిని శతాంశము వారలు గారు దద్దడన్
దున్నకవిత్వమందు వలఁతుల్ మనవారలె యౌదు, రంచు; నే
మున్నది దానిలో ననుచు, నుండిన దేదియొ యున్న దంచు, నా
తెన్నొకకష్టమే యను, చుదీర్ణతరమ్ముగ వాదు లాడుచున్. ౮౫

ఉ॥ ఏమియు రానివార లెటు లేది యొనర్చిన మంచి దౌ నుధీ
గ్రామణు లట్లొనర్చునెడ గ్రాంథికు లొప్పరు సాఁగఁ దీఱు రిం
తే, మనవారు వోలె నలతిర్పతివేంకటపండితుల్ వచ
స్తోమము జార్చ లేరె యది దోసము గాఁ దలపోయ కుండుచో. ౮౬

ఉ॥ జార్తురు గాక నోరెటులొ చయ్యన, నొయ్యన నట్టి పద్దెముల్
గూర్తురుగాక వీరు "చెవి గోసిన మేఁకల" పోలికన్ జాలనే
పార్తురె! దయ్యరే? యుభయు లంత బలాఢ్యులె దేహదార్ఢ్యమం
దేర్తురు కొప్పరంపుఁ గవు లీకవియుగ్మము నొక్క వ్రేల్మిడిన్. ౮౭

చ॥ అనునెడ దేహదార్ఢ్యమునకా యలవారలు గాలు ద్రవ్వ రి
వ్వనియెడ నేను జాలనొకొ? పాండితియున్న భయమ్ము గాని వీ
రిని మఱి వారినిం గలిపి రేనియు నాబుజ మొక్కటే నుఁడీ
పనిఁ గొని యాఁపు నం చొకడు బాహుబలాఢ్యుఁడు పల్కె నల్కమై. ౮౮

క॥ అని వారి వారికిన్ దోఁ, చినగతిగాఁ "బిచ్చ పాటి" చెప్పికొనుచు భో
జనపుం బనులకుఁ జని మఱి, దినమున నటనుండి బయలు దేఱిరి వారల్.

చ॥ నెలవున వ్రాసె సూక్తులనకుఁ జెచ్చెర వెంకటశాస్త్రి మున్నె, యీ
కలహము దేలునంతకును గాల్గదలింప నటంచుఁ బంతముం
గలిగి వసించె నప్పురిని, గయ్యపుసంగతు లాలకించి శి
ష్యులు మఱికొంద ఱయ్యెడకుఁ జూడఁగ వచ్చి తనుం భజింపఁగన్. ౯౦

చ॥ సరసులు యోగ్యులౌ జనులు సంతతముం గవితాదరమ్మునై
నెరఁగుచు విందులన్ దనిపి యెంతయు గౌరవ మాచరింప న
ప్పుర మది వాసమై యచటిపూజ్యులకుం దలలోనినాల్కలై
తిరుపతి యప్పు డప్పు డరుదేరఁగ, వెంకన యుండె నయ్యెడన్. ౯౧

శా॥ "ఆసీమాంత మొనర్చి గాని విడువం డావెంకటేశుం" డటం
చాసీమన్ జనులెల్లఁ జెప్పికొన నిత్యమ్మున్ గవిశ్రేణి కెం
తే సంతోసము గూర్చుచున్ విమతు లంధీభూతచేతస్కులై
యీసుం జెంది కృశింప మూఁడునెల లందే యుండె నుద్దండతన్. ౯౨

ఆ॥ వె॥ మొదటఁ గాలు వెట్టినది యల్ల*శిష్ట్లాహ, నూమదార్యగేహసీమ యచటి
నింబభూరుహంపునీడ సాక్షాత్కల్ప, పాదపంబునీడ గాఁ దనర్చె. ౯౩

ఉ॥ చాపలు నిండి బల్లలకుఁ జాలి రజఃకణకీలితంబు భూ
మీపద మాక్రమించి పయిమిక్కిలి వీథికిఁ దాఁకి గేహపుం
దాపున నున్నయన్యసదనంబుల ప్రక్కల నిల్చి సారెకున్
శ్రీపతివేంకటేశ్వరులు చేయుప్రసంగము విందు రెల్లరున్. ౯౪

శా॥ అంబా! నింబము నీనివాస మదియో! యభ్రంకషానూనశా
ఖం బచ్చో నెపు డీవు పొల్చు టది నిక్కంబే, భవత్సాక్షికం

---

(గుంటూరినుండి బ.గ.లు దేఱు సహాయమునఁ జెప్పినది.)

*సీ॥ తిరుపతి వెంకటేశ్వరుని కొండకు నీకు భేదమే కనుపట్టలేదు తల్లి, శ్రీ శైలమల్లేశు శిఖరమ్మునకు నీకు భేదమే..., మధురమీనాక్షి వేశ్మస్థలికిని నీకు భేదమే..., కాశికావిశ్వేశుగర్భగుడికినీకు భేదమే... తల్లి, తే॥ గీ॥ ఎట్టిసుముహూర్తమందుఁ దాఁగట్టెనొకొ, ఘనుఁడు శిష్ట్లాహనూమదాఖ్యాక సుకవి, అడుగు వెట్టిన దాది బ్రహ్మోత్సవముఁ జేసి, పంపుచుంటివి నినువీడ వలనె నేఁడు. (వెం॥ శా)

బుం బూజ్యాశయసాక్షికంబు నగుచుం బొల్పారుతత్తత్స్వభా
లంబంబౌ కవితాప్రసార మది యేలా నొక్కి వాక్రుచ్చుటల్, ౯౫

మ॥ ఎటు నీభక్తులవాఙ్మధుస్రవము లందే పారె, శత్రువ్రజం
బటకున్ వచ్చి మనంబునందు నెటు "ఛీ" లౌవాగ, బింకోగ్రపుం
గటువాక్యమ్ముల కెట్లు వారురక దుఃఖం బందువా, రెట్టుగాని
గుటకల్ మ్రింగెడివారొ? నీమది యెఱుంగున్ జెప్పఁగా నేటికిన్. ౯౬

ఉ॥ ఐనను శాఖ బాధ కయి యావలికిం జని తప్పచొప్పులన్
బూని యవాచ్యముల్ పలికి పుచ్చియు నెమ్మన మూఁగ లేక మా
పై నెనరున్నయట్టులుగ వచ్చి రసం బది గ్రోలి పోవు వా
రేని యథార్థముం దెలియ నెల్లరు నీవును డాఁగుచుందు రే. ౯౭

చ॥ ఎలమి వచించి తీరవలె నీకపటాత్ములసత్స్వభావ; మీ
యలఘుల కేము శత్రువులపై మఱి మావచనంబు లెట్లు వీ
నులకు రసాయనంబు లగునో? యని జీర్ణము లైన వెంట లే
ఖల కపవాదముల్ పలుకఁగాఁ గరముల్ దిరుగాడు టెట్టులో. ౯౮

క॥ ఖలజనులవర్తనములకుఁ, దల యూని తోఁక యని చెప్పఁ దరమౌనె? యలపా
పుల కేమి నింబకుజభూ, తలసభ లవి యెంత కేని దగు జగదంబా. ౯౯

శా॥ అరు లగువారి కెట్టు లెదయందలి కుంపటివోలె నుండి యా
తిరుపతివెంకటేశ్వరులు "తీర్పరులన్ బిలిపింపుఁడీ, సభన్
జరుపుఁడి మీసముల్ పెఱుకఁ జాలినచోఁ బెఱుకుం డ,,టంచుఁ దీ
వరముగఁ దెల్పఁ గొప్పగవువారిబడాయి క్రమక్రమమ్ముగన్. ౧౦౦

ఉ॥ తగ్గి యిదెట్టులేనియును దప్పికొనన్ వలె నంచు నంతటన్
బగ్గెలు వ్రాయ మాని తమపక్షము దుర్బల మౌట నెట్టులు
న్నెగ్గ దటంచు లో నెఱిఁగి *నెయ్యపుఱుకుం గడు గూఢవృత్తిపై
నగ్గతి డాఁచి స్నేహ మగు టర్హ మటంచు లిఖించుచు న్వెనన్. ౧౦౧

---

చెన్నపురి; లైబ్రరీ, గురువారం.

*....నిన్న కొప్పరపుంగవులు నాపేర 8 పేజీల ఉత్తరం వ్రాసినారు, వివాదప

చ॥ పయికిఁ బ్రగల్భవాక్యములె పల్కుచు నప్పరచుండె తీరికన్
గయికొని కూరుచుండిరి ప్రకంపితమైన మనంబు చందమె
ల్లయెడల నెల్లరుం దెలిసి "బావజీ" రంచు వచించుచుండున
ప్రియములు పూర్తిగా వినియు బీరము మానర వారు మాటలన్. ౧౦౨

ఉ॥ అంతట వారిపక్షమున కాదరు వౌకులవృద్ధుఁ "డక్కటా!
యంతన తేలి పోవు నని యంపు మటంటిమి పత్ర మల్లవా
రెంతటివట్టు పట్టిరో కొని యిప్పరి పీడరు కొప్పరంపువా
రెం తలవారి ఘాటికి; కిపు డేమనుకొన్న మతేమి లాభమా. ౧౦౩

మ॥ పులిపై బెడ్డను వేసి చెట్టుపయికిం బోవన్ వెసన్ దత్తుఁడా
స్థలమందే యిది పీఁట వెట్టి యెటులో సాధించుఁ గావే పగన్
దొలి నాఁడే వన చాల దయ్యె నపు డేదో వ్రాయు మన్నారమి
ష్టలఁతెం బో కది "యేమి పేపె,, కనెడి సామ్యం బయ్యె నెట్లో కదే ౧౦౪

ఉ॥ పాపము! "వారిదాసులము వారలలోన శతాంశమేనిఁ గా
మోపము వారి,, కంచు నతి యోగ్యుఁడు కొప్రపు జ్యేష్ఠుఁ డప్పు తా

రిత్రమును వ్రాసినారు, తమదోషము లేశమును లేదనియు వె॥ శా॥ అన్యాయముగా గర్హించిరనియు, మొదలుగా వ్రాసినారు. దానినై ఖరిచూడఁగా వివాదమునుండి తప్పించుకొనుట కిష్టపడుచున్నారని తోఁచుచున్నది. అట్టి ప్రయత్నమున్నచో తప్పకమీరును అంగీకరింప వేఁడెదను ఈ వివాదసభలు కార్యకారులు కావు. నడుమవారికి పండువు, పోరాడువారికరువ్వరకు శ్రేయము కన్పడదు, ఈసభలలో తీర్పుతీర్పువా రెవరు? ఎట్లు సాగును? "లోకోభిన్నరుచిః, తత్రాపి స్వస్వపక్షాభిమానోబలవాన్ బాధతే, వారు "ఛాలెంజి,, ప్రచురించినందుకు, శివరామశాస్త్రి మరల ప్రచురించెను. ఇంతట నాఁగిన బాగుండునని నేను తలంతును నా ప్రార్థన మిదియే. ... ఏవిధముననైనను తగవు మాపుకొనుట బాగు, నేను వారికేమని సమాధానము వ్రాయుటకును పాల్పకయున్నాను, జబాబు వెంటనే వ్రాయించవలెను...."

వే॥ ప్రభాకరుఁడు.

నూపిన యంతవట్టు మొగమోడక చెప్పె వృథాభిమానపుం
దాపము నాఁడు మామదికిఁ దద్వచనమ్ముల నెక్కెనీ దహో. ౧౦౫

ఉ॥ ఎంతటి ధైర్యమున్ మఱియు నెంతటిశక్తియు లేక యున్న ని
శ్చింతగ నాఁటి సత్సభ "ససేమిర వారల శాసనంబు మా
చెంత ఘటింపఁ గూడ" దని చెప్పఁగ నేర్చునె? వేలు సీమ య
న్నంతన భీతి పుట్టు వలదా? కలదా? యిటువంటిచేవయున్. ౧౦౬

చ॥ ప్రముఖుల మెంతమంది పని పట్టితి మక్కటా! వారిముందు మా
ఱ మయితి మింత కెంతటిపరాభవ? మూరక కొప్పరంపువా
రి మొఱవ మిక్కుటమ్మునఁ బోరిం బోరిఁ దగ్గఁగఁ జొచ్చె నే యుపా
యమున నొ వీరిపైఁ బడునపాయముఁ బాయఁగఁ జేయఁగా వలెన్ ౧౦౭

మ॥ * అని యోజించుచు నుండె నంత నొకనాఁ డాయీప్రసంగంబు నె
ల్లను విన్పింప సభం బొనర్చి తగుహేలన్ విన్కి సేయంగ వ
చ్చినవా రెల్లరుఁ బత్రికల్ వినుచు మంచిన్ జెడ్డ యోజించుచుం
డు నెడన్ గొందఱు వచ్చి రయ్యెడకు నెట్లో యాసదస్సాఁగఁగన్ ౧౦౮

---

* నిష్పక్షపాత హృదయులును యథార్థపరిజ్ఞాతలును గుంటూరుపురవాస్తవ్యులు నగు నార్యసోదరులారా! కొప్పరపువారు ప్రతిజ్ఞాపూర్వకముగా 27 వ తేదీ ఆదివారమునాఁడు సభకు రావలయునని ముందుగా మాపైఁ గాలుద్రవ్వ పత్రిక వ్రాసి, యందులోని యసందర్భములను దెల్పుచు మేముత్తరమీయఁగా వానికిఁ దగు సమాధానము వ్రాయక యేవో కొన్ని యుక్తులతోఁ గొన్ని యుత్తరములు వ్రాయుచు సభ ఆదివారము దప్పించి సోమవారమునకు మార్చిరి తుద కాదివారమునాఁటిరాత్రి యనేకగ్రామములనుండి విచ్చేసిన మహాజనుల విఫలమనోరథులం జేయుట యుచితము కాదని మేమాదివారమునాఁడు వ్రాసిన యుత్తరములోఁ గొన్ని పండితసమ్మతములైన నిబంధనము లుదాహరించి "యీ ప్రకారము మీరు సభ కూర్చుఁడు లేదా మేము గూర్చెదము అంగీకారానంగీకారములు రేపుదయమునకు దెల్పుఁడు లేదా మీరీయుద్యమము మానుకొన్నట్లే ప్రజలుదలంతురుగాక" అని స్పష్టీకరించినను దానికి జవాబు వ్రాయక సభానిశ్చయదినమునందుఁగూడ నుదయము 8 గం॥కు మరల రిమైండరు పంపినను దాని

ఉ॥ వచ్చిరిగాని యీసభ యథార్థముగా జరిగెన్, సమస్తమున్
విచ్చినసంటిపండుబలె విజ్ఞులదృష్టికి స్పష్టమయ్యె "ని
మ్మచ్చర మెందుకీగతి గబాగబ లాడిరొకోరి,, యటంచు వె
న్నిచ్చినవారి చూడకి "రిహిహీ! యిహిహీరి,, యని కొంద రయ్యెడన్. ౧౦౯

---

కిని నేమిచ్చుఁబలుకక వల్లఁగాక దినమొల్ల దాఁటించి ఆమఱునాఁడు 29వ తేదీని మాకవసరము లేకున్నను మేము వారల "మీయుద్యమము మానుకొన్నట్లేయని తలఁచి మేము కాకినాడ వెళ్లుచున్నా" మని వ్రాసిన యుత్తరమునకును దగిన సమాధానము నేమియు వ్రాయకుండుటచే వారు సభను మానుకొన్నట్లు ముమ్మాటికిని స్పష్టపడినది. పిదప సభమాటట్లుండఁగా మీ మా యుత్తరప్రత్యుత్తరములలోని సారాసారములను న్యాయాన్యాయములను ప్రాజ్ఞులమూలముగాఁ దీర్చికొని పిమ్మట వివాదమునఁ బ్రవర్తింతమనియు, ఇందులకు రేపుదయము 8 గం॥కు లోఁగా జవాబిండనియు 29వ తేదీ రాత్రి 7 గంటలకు మా వ్రాసిన యుత్తరమునకు నేఁడు 10, గంటలకు ననవసరపు యుక్తులతో దానికిఁగూడ నంగీకారమును దెల్పక "యుత్తరప్రత్యుత్తరములు ముగించుకొన్నాము" అని వ్రాసిన యుత్తరమునుగూడఁ జూచి వారికి జవాబు వ్రాయుట యింతతో ముగించుకొని ఆయీయంశములు లోకులకు శ్రుతపఱుపఁ దలఁచి ఈనాఁటి సాయంకాలము 6 ఘంటలకు శ్రీ ఫస్టుకంపెనీనాటకశాలలో మాపన్యసించుచున్నారము గాన దామెల్ల విచ్చేయఁ బ్రార్థితులు.

ఇట్లు,

గుంటూరు, 30-8-11. తిరుపతివేంకటేశ్వరులు, శతావధానులు.

పైనుదాహరించిన యాహ్వానపత్రిక ననుసరించి శ్రీ ఫస్టుకంపెనీ హాలులోనికి ననేకులు పౌరులును నితరులునునగు మహాజనులు నియమితకాలమునకు మున్నే వచ్చియుండిరి. పవపడి కాలేజి ఉపాధ్యాయులగు బ్ర॥ శ్రీ॥ మున్నాది వెంకటస్వామయ్యాజులవారి కోరిక ననుసరించి శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు బి. ఏ. ఎల్. టి. (వీరును కాలేజీ యుపాధ్యాయులే) గారగ్రాసనాధిపత్యమును వహించిరి. వీరు సంస్కృతాంధ్రములలో గ్రంథముల రచించిన పండితకవిసత్తములు. పిదప నాయీయుత్తరములు తిరుపతివెంకటేశ్వరులు వినిపింపఁ దొడంగిరి. మొదట వెంకటశాస్త్రిగారు శ్రీకొప్పరపువారి మొదటియుత్తరమును మాత్రము

ఉ॥ పనిగొని యుత్తరాల్ వినుచు పట్టున నా సభ నాఁగుపూనిక౯ వ
చ్చిన యలశ్రీనివాసగుణశేఖరువైఖరి "కొప్పరంపున
ర్తనములయుత్తరమ్ము లవి ప్రాజ్ఞసభాన సుకూలదుర్వచః
ఖను లని యెల్లవారలకుఁ గన్పనఁ జెప్పక చెప్పె నొప్పగ౯. ౧౧౦

---

వినిపించి ఆనాఁడే 12గంటలు మొదలు మూఁడు గంటలవఱకును గోర్టులోఁ గంసాలులను గూర్చిన వ్యాజ్యములో సాక్ష్యమిచ్చి యుండుటవలని యాయాసము చేఁ గాబోలును పదపడి యుత్తరములను దిరుపతిశాస్త్రిగారిని వినిపింపుమనిరి. తిరుపతిశాస్త్రిగారు వినిపించుచుండఁగాఁ గొందఱు పెద్దమనుష్యులు వచ్చి యంతతో ప్రకృతసభ ముగించుటకై వెంకటశాస్త్రిగారిని గోరిరి గాని తగినంత హేతువును జూపి కోరనందున వెంకటశాస్త్రిగారందుల కంగీకరింపరైరి. పిదప గంభీరముగాఁ దిరుపతిశాస్త్రులుగారు రాయాయీయుత్తరప్రత్యుత్తరముల నుపన్యసించుచుండఁగా వెంకటశాస్త్రులుగారు దాని నాఁపనుంకించువారితో సహేతుకముగా మెల్లఁగా నుపన్యసించుచుండిరి పదపడి సభ నాఁపుడని కోరినవారు తామేదో మధ్యచెప్పుటకు నవకాశమిండని కోరిరి అందులకును దుట్టతుదకుఁ గాని వీలులేదనియు నప్పుడేని యగ్రాసనాధిపతుల నడుగఁదగియుండుననియు వెం॥ శా॥ గారు బదులు చెప్పిరి. పదపడి యుత్తరములనెల్ల దిరుపతిశాస్త్రిగారు వినిపించిన పిదప నెవరు సమర్థులో, యెవరు కారో, యెవరియుత్తరములు దురుసుగా నున్నవో యెవగివట్టివి కావో? యెవరు కోరిన షరతులు పండితసమ్మతములో యెవరివి కావో, యెవరి వెనుకతీఁతవలన సభ కాలేదో, లోనగు నంశములు సభ్యులకే కాక సభ నాఁపవచ్చిన యుత్తమపురుషుల హృదయములకుఁ గూడ స్పష్టపడినవి. ఆ యీయంశములనే శ్రీ అగ్రాసనాధిపతిగారు తుట్టతుద నుపన్యసించుచు "మీసములపద్యము యొక్క యర్థమును గూర్చి,, తాము కూడ నిదివఱకుఁ బొరపాటుగానే యన్వయించుకొంటిమనియు నిప్పుడది స్పష్టముగాఁ దెలిసినదనియు నుభయభాషలు రానివారు దానిజోలికిఁ బోఁగూడదనియు సంస్కృతము రాని తెలుఁగు గణనీయము కాదనియు నుపన్యసించుచుండఁగా సభ నాఁగు పూనికతో విచ్చేసినవారు ప్రకృతమా విషయము నాఁగవలసినదని కోరిరి. దానిమీఁద నగ్రాసనాధిపతిగారు "వీరికోరిక ననుసరించి యా పద్యార్థము నిప్పుడు విస్తరింపక వదలితి" మని చెప్పి యా విషయము మాని తమకీయుభయకవులయందును భగవంతుఁడును న్యాయముగాఁ [illegible] యభిప్రాయమును వెల్లడించిరి. అది విని సభ్యులెల్ల నా

ఉ॥ ఏమిటి కాఁగఁగా వలెనని? యెల్ల రెఱింగినయుత్తరమ్ములన్
శ్రీమహితుల్ మహామహులు చేరినసత్సభ వినిర్ణ నేయుచో
నామహితుండు ప్రాజ్ఞుఁ డగునట్టిఁడు గావున వారితప్పదుం
బూమెలు కంపు గొట్టు నని బుద్ధి గలంగినవాఁడుగానిచో. ౧౧౧

క॥ ఉత్తరముల తత్త్వములు, సత్త్వములను నేహ్యమైన చందము గలవం
చుత్తముఁడు శ్రీనివాసుఁడె, విత్తములకు సాక్షి యని వివేకు లెఱుఁగుతన్.

క॥ *కుచమర్దనాదిపదముల. రచనం బచరించుకొప్పరపువారి వచో
నిచయము గలపత్రికలను, నచటం గలసభ్యు లేవమందిరి పెలుచన్, ౧౧౩

క॥ ఆమెయి సాక్షాదశ్వ, త్థామన్ బురణించు తేజు దశదిశలలమం
గా మాశిష్యుం డలశివ, రామయ చనుదెంచె సభ కరం బలరారన్ ౧౧౪

ఉ॥ $వచ్చి సభాంతమందుఁ దనవచ్చిన హేతువు, తాను విన్నయా
యచ్చెరువున్, సభాధిపతి యాజ్ఞను బొంది సభాసదుల్” బలే?

---

నందించిరి. పిదప శ్రీ వెంకటశాస్త్రులవారు కవితయన నేమో, కవియన నెవరో, ఆశుకవితయన నేమో, కవికివలసిన సామగ్రియేమో, తేటతెల్లముగా నుపన్యసించిరి; పదపడి సభనాఁగు పూనికతో విచ్చేసియున్నవారిలో నొకరగు మ॥ రా॥ రా॥ గోవిందరాజుల శ్రీనివాసరావుపంతులు బి, యే, బి, యల్. గారు సర్వసమ్మతముగు తమ మనోరథమును వెల్లడించిరి. వారిపూనికకు వెంకటశాస్త్రిగారు తమ సమ్మతిని దెల్పిరి.

*(3) ఇంతనైన మీాస్వకుచమర్దనములు మానుకొని”...

30-8-11 ఇట్లు,

కొప్పరపు వెంకటసుబ్బారాయశర్మ-శతావధాని.

ఉదయము—9—గంటలు.

$ పదపడి యంతలొక యరగంటకును న్నైరైలుదిగినభాభవమునకువచ్చి యున్నట్టియు, తిరుపతివెంకటేశ్వరుల శిష్యుఁడైనట్టియు, చిరివాడ గ్రామ కాపురస్థులు శ్రీవేలూరి శివరామశాస్త్రులవారికి క్రిందిపద్యములఁజదివిరి.

ఆ॥ వె॥ రాజశ్రీ భుజంగరావు, చెల్పతిరావుఁ గూర్చి యిటులు వ్రాసె, గుంటు

నచ్చినశిష్యుఁ డీతఁడె" యనన్ విని నింపగుకంఠమాధురిన్
హెచ్చగుగానపుంబటిమ యేర్పడఁగాఁ జదివెన్ గ్రమమ్ముగన్ ౧౧౫

గీ॥ పదపడి సభ్యులు సారెకు నెవ శివరామకవి వాణి నెంతయు మెచ్చ్యల్
వాదలఁగఁ గరతాళంపుని, నదములఁ జెలఁగేఁగఁ గ్రన్ననన్ సభ మ్రుగ్గెన్

క॥ ఆమఱునాఁ డుదయము శివ, రామయ కొప్పింపుఁ గవిపు "రంగమ్మున సభా
సీమ" కని యుత్తరంబు, వ్రాసిత లిఖియింతు." ననుచుం దద్దయు నెమ్మిన్.

ఉ॥ వెంకటశాస్త్రి పల్కె "నది విన్న బుధుల్ మను సన్వ నస్తైని
శ్శంకగ నిన్న నవ్వుదురు శాస్త్రము నేర్చియు సాహితి న్నిరా
తంకతఁ జేర్చియున్ శతవధానిని నైయు యసమానశక్తగాఁ
నంకెలు వైచెదే? "సభకు రం" డని కొప్పవవారిఁ బిల్చుచున్. ౧౧౬

క॥ † అసమానకక్ష యని మము, నన దూరెడివారియుత్తరము లిఖిగో? నీ
రస మీకయ్యెమమాకున్, బోనఁగెం దనయంతఁ బూర్వపుంగర్వమునన్.

---

రిపురి, జరుగుచున్న వైరచర్యయందునఁ దిర్పతికవి, వెంకటకవి, తెనుఖుతప్పె॥1॥ చ॥ అనవిని యంత నామడలు నామడలుంబడిపోయినట్లు వచ్చిన నసమిథ్యయంచుఁ దెలిసెన్ గవితాసభ లేక పోయెఁగా, కనుపుగ ధారణాబలము నందున నాశుకవిత్వమందునన్. దనివిగఁ గొప్పపుంగవుల దారులుతీరులు చూచితీర నే ॥2॥ తే॥ గీ॥ కాశినాథబుధేంద్రుఁడు ఘనుఁడు శ్రీని, వాససూరియు నెందఱో వలఁతులైన, కవులు పీఁకనిమీసమ్ము కఱచిపట్టి, పీఁకను న్నారె కొప్పింపుఁ బిడపకవులు ॥3॥ తే॥గీ॥ కలఁడు నేత్రావధానంపు గరిమయొకఁడు. కలఁడు గర్భావధానంపుగరిమయొకఁడు, కలఁడు హస్తావధానంపు గరిమయొకఁడు, వీని నెఱుఁగని సూరులెందేని గలరె॥4॥ ..."

---

1. †...యిదివరలో వున్నదే అసమాకక్షఅని అనుకుంటూ వున్నసంగతిలో పులిమీదపుట్రలాగున్న యిదివకటి వచ్చినది దీనిని గు॥ కొన్నిరోజులువర్ధ పుచ్చుడమున్నా శ్రమతీసుకోవడమున్నా నాకు సుతరాం యిష్టంలేదు...."

ది 28-8-11 రా॥ వెంకటసూర్యరావు.

Masulipatam,

2. బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి శాస్త్రులవారిసన్నిధికి, మీరుకృష్ణారా

చ॥ జ్వరితుఁడ నయ్యు సజ్జనులు సారెకు రమ్మని పిల్వ రానిచో
గరువముగాఁ దలంతు రని కస్తిఁ గణింపక వచ్చినాఁడ ని
ష్ఠురపునిరోగివై దిసలపాత్రి సుమంతయు నే నెఱుంగ దు
ర్భర మనమానకక్ష యిటు రాఁ దగి యుండఁగ నెల్లెఱింగెదన్.

ఉ॥ ఐనను గాలు ద్రప్పదొసఁ గాదెన సుండుటఁ జేసి యంత మా
పై నెపముండ దీ విపుడు పత్రిక నంపెద వేనిఁ బోరికిం
దా నయిపిల్చినట్ల యయి "తక్కెడ" సామెతగాఁ దనర్చు నీ
మానఁగదయ్య యిట్టియసమానపుఁ గక్షకు దీక్ష యేటికిన్.

ఉ॥ ఎప్పటికేని మాయెదుటనే పడఁగా వలె వార, లప్పుడా
తప్పుమఱైతపద్ధతులు తజ్జ్ఞులకున్ విశదంబు కానలెన్
జెప్పిప్రసంగముల్ సలుపు పెద్దలతోడుత నీకు నేల? నేఁ
జెప్పినమాటచొప్పునకుఁ జేతము చొన్పుచు మిన్నకుండుమీ.

చ॥ వెనుఁబడి కాకవుల్ తనదువీపు జయింప జరణమ్ము లుంచి తా
చిన నది లెక్కగాఁ గొనక చివ్వకుఁ బూనక వైనతేయుఁ డే
మనక శిరమ్ము వంచుకొని యల్లనఁ బోవఁడె? శక్తిమంతు లెం
దును నలఁతుల్ పొనర్చు నలతుందుడుకున్ గణియింప రంతగన్.

---

వుగారి పేరున వ్రాసిన జాబు చేరినది, మాయుభయుల నమస్కారములను అంగీకరింపవేడుచున్నాను, యథార్థవాదియొక్క వ్యాసము యథార్థముగనున్నను లేకున్నను దానిసత్యాసత్యములు మేము గ్రహింపజాలము .........మీరీలేనిపోని కలహములలో జిక్కుకొని ఆరోగ్యమును, బుద్ధిని చెడగొట్టుకొనుట మాయభిప్రాయము కాదు. వారిని గెల్చినను మీ కీర్తి హెచ్చునా? ఇదివఱకే మీఖ్యాతి జగద్విఖ్యాతమైనపుడు మీకీపోరాటము లెందుకు? 'వారుకుర్చీమీద' గూరుచుండిన మన కేమి? ఇంటి కప్పమీదగూరుచుండిన మనకేమి? మీబలాబలములు లోకము పూర్తిగ నెరిగియే' యున్నది.' ఈపోరాటములను 'గుంటూరు చెరువులో' ద్రొక్కి వెంటనే బయలుదేరి రావలయునని మా ప్రార్థన..."

ఆ॥ నారాయణరావు.

ఉ॥ ఇంతకు నీవు పత్రికల నెన్నిటి నంపిన నేమి లాభ? మా
వింతకవీశు లెన్నఁటికి విజ్ఞులు తీర్పరు లున్న సత్సభా
భ్యంతరమందు ని న్నెదురువా రనుకోకుము వారితండ్రినాల్
గాంతు రెవారు వారికడ గంతులు వేయుచునుం డ్రెఱుంగుమీ, ౧౨౪

శా॥ "ఓ కెన్నో మతిపంక" లన్నఁ దెలియన్ సాజింపఁగా లేనిస
ద్ధీకుల్ వారికిఁ దోడు, వారిదియుఁ దావృద్ధి విశేషంబె యీ
యేకాకారులు సత్సభాస్థలికిఁ దా రేమంచు నేతెంత్రిని నీ
వీకార్యమ్మునకుం గడంగకుము మేమే యుంటి మన్నింటికిన్. ౧౨౫

చ॥ అనుటయు నాతఁ డప్పటికి ననన్యము చెప్పక మిన్నకుండె నె
మ్మనమున బాల్యచాపలము మానని చందము తోఁచుచుండె, నా
తని కొకకొంత తిర్పతి స్వతంత్రత నిచ్చె ననంతరంబు వెం
కనఁ గికురించి యిర్వురను గ్రక్కున నేగిరి "ప్రసన్న" ప్రశస్తికిన్. ౧౨౬

ఉ॥ * పద్దెము లచ్చు వేసి యవి పంపి నభోమణి రెండుయామముల్
ప్రొద్దును దాఁటునప్పటికిఁ బూర్తి యొనర్చిన మేటికావ్యముల్
దద్దయు మెచ్చుకొంచు బసదగ్గఱకున్ జనుదెంచి చెప్పి రిం
కెద్దియుఁ జేయ రామి సహియించెను వెంకన కొంత సుద్దులోఁ. ౧౨౭

---

మ॥ రా॥ రా॥ శ్రీ కొప్పరపు వెంకట సుబ్బరాయశర్మగారికి.

* చ॥ తిరుపతి వేంకటేశులకుఁ దెంపరివై సరివైఖరింగవీశ్వరుఁడగు వాఁడు నోటనుడువన్ గడు సిగ్గిలు నాశుధారకున్, బిరికొలుపం దలంచితె 'సమాన మ' యంచు వచింపకేటి య, ల్లరియిది నింగ సొన్నపలలంబు భుజింపక పూరి సేయునే. మ॥ అనిమిత్తంబుగఁ గాలుద్రవ్విన త్వదీయాహంత నాఁపుం దలంప, పున నీనీరసనిర్గుణాశుకవనంబున్ జెప్పి నిన్నెల్వ నెం, చిన యుస్మద్గురువర్యులన్ సుకవితాశ్రీధుర్యులన్ మానిపిం, చి నినున్ గెల్వఁగ వచ్చినా నిదె సభం జేయింతువో వత్తువో. ఉ॥ గంటలు గట్టికొంటివట? "గంటకువందలు పేలుపద్యముల్, గొంటుదు" నంచు నేఁడు పరికించెద గొంటుట మెట్టిదో? నినుం, గొంటెద నే వధానము [illegible] నీరసధారయందు నీ, ఘంటికలూడఁ గొట్టెదను గాచుకొనం గ [illegible]. సీ॥ గురుపాదసేవఁ జేకూర్చిన వ్యాకృతి పాండిత్యగరిమ [illegible] యుండనిచ్చి [illegible] భాషా కావ్య విభవాభిరామమౌ పాండిత్యగరిమ [illegible]

శా॥ * రామస్వామి యనంతరమ్ము కడుధీరత్వమ్ము చెన్నారఁ నే
నీ మా పద్దెము లిప్పి తెచ్చి యవి మ మ్మాక్షేపింపుఁ డన్నన్ క్షణం
బేమిం జెప్పక పిమ్మటం జదివి" హూ! కీపద్దెముల్ వారిదౌ
సామర్థ్యమ్మునఁ గదున్ యథార్థముగ నిచ్చల్ వచ్చి వాక్రిచ్చెడిన్ ౧౭౮

---

చ్చి, రసవత్ప్రబంధనిర్మాణధీ చాతురీపాండిత్యగరిమయటుండనిచ్చి, సురుచిరలక్షణభరితాశుకవిత్వపాండిత్యగరిమ యటుండనిచ్చి॥ గీ॥ ఆశుపరసంబటంచుఁ గొండాడఁదగిన, తావకాశుకవిత్వంపుఁ జేవఁ గూడఁ, దావకశతావధానవిధంబుఁ గూడఁ, జూడఁదలఁచితి వేంకటసుబ్బారాయ! చ॥ తిరుపతివేంకటేశ్వరసుధీవరశిష్యుఁడ నాదుపేరు వేలూరి శివరామశాస్త్రి యని లోకము వాకొను నాఢ్యమైన వ్యాకరణముజీవనమ్ము నధికారము కావ్యపురాణనాటకా, కరములఁ; జేయుఁజాలుదు నఖండముగాఁగ శతావధానమున్॥

గుంటూరు
31-8-11

ఇట్లు వినీతవశంవదుఁడు,
వేలూరి శివరామశాస్త్రి,
శతావధాని.

---

* మహారాజశ్రీ కొప్పరపు సుబ్బరాయశర్మ గారికి—సీ॥ ఆఱవదేశంబున నవధాన మొనరించు, టోకాదె? యిదియు గుంటూరుసీమ, పల్నాటిసీమలోఁ బద్యంబులను జెప్పు, టోకాద! యిదియు గుంటూరుసీమ. ఆయూరనాయూర నాశుకవితఁ జెప్పు - టోకాద! యిదియు గుంటూరుసీమ, గుడివాడసీమలోఁ గొన్నియూళ్లను జెప్పు - టోకాద! యిదియు గుంటూరుసీమ, గీ॥ యెట్లుదక్కించు కొందురో యిపుడు మీరు, నిందుకొల్వున ఘనవస్త్రదండిబిరుదు, లూరకే పోదు పూజ్యులఁ గాఱులఁబోవ, నాశుకవిసింహ! యుండిన హంసలార. ఉ॥ బట్టులరీతిఁ బద్యములఁ బల్కిటే కాని శతావధానమె, వ్వట్టుల నేదిచేసితిరి, పండితులెల్లరు మెచ్చినారలో, గుట్టుగఁ బోవకీగతిని, గొంటెతనంబును జేయఁజూతురే, "పెట్టలు క్రొవ్విపొంజెరయి, భీరముఁ జూపిన" లాగుఁదోఁచెడో. గీ॥ జగతివైదికులౌట ఘనసాలఁ ద్రిస్సి, కొన్న నెవ్వరు నవ్వరు; నిన్ను నవ్వ, కుందురే కన్నవారు నియోగివయ్యుఁ, మీసములఁ గాచుకోలేక మిడుకుచుండ. క॥ గంటలఁ గట్టెదరే! ము, క్కంటితురగములకు హలికవితానంబీ, గంటలు మఱియేకార్యము, పొంటె వచింపుండు కొ

ఉ॥ వారలకన్నఁ దెల్గునెడ వారక సంస్కృతమందుఁగూడ నీ
వారయఁ బెద్దపండితుఁడ వైనను వారలు బ్రాహ్మణుల్ మహా
శూరులు మేల్నియోగులును "శూద్రుఁడ వీ" వని యీసడింతు రీ
వేరమునందుఁ గాలిడక వేగమ యేగుమ యంగలూరికిన్.

తే॥ గీ॥ వారితప్పదుఘారను వడిగఁ బోయి, సభ్యులగరంప నీకు నసాధ్య మెవ్వ
డేని పనివడ్డచో మేమె యేగ వలయుఁ, బిదపనిదితప్పటంచు నొప్పింపవలయు.

చ॥ అనుటయుఁ బిన్నవయ్య నగి యాతఁడు "చిత్త" మటంచు నేగి యే
మని మది నెంచెనో? తుదకు నాతనివద్దిము లచ్చులోనికిన్
జనుటయ కాక, కొప్పరపుసన్నిధికిం జనె వీని నెల్ల నే
మనిపిన వే యటంచును యథార్థ మెఱుంగని వారు దూఱఁగన్,

ఉ॥ ఇన్న యథార్థ మియ్యది మహాత్మము లొప్పదు రంచు మేము సం
పన్నగృహస్థులం దనుప వ్రాసితి మింకొకకుఱ్ఱశిష్యుఁడున్

---

ప్రపుంగవులారా. సీ॥ శతఘంటికావధానంబుసల్పుదు మన్న మీ - శక్తియడంప నేఁ జాలనొకో, అష్టావధానంబు నాచరింతుమన మీ - శక్తియడంప నేఁ జాలనొకో, ఆశుకవిత్వంబు నాచరింతుమన మీ - శక్తియడంప నేఁ జాలనొకో, సద్గ్రంథరచనంబు జరపుదుమన్న మీ - శక్తియడంప నేఁ జాలనొకో, గీ॥ ఇంగిలీషున వత్తురో యెఱిఁగియాడవఁ - గరము నేఁజాలనొకో మాగురువులేల, రండు వేగమీబిరుదులు దెండు పెట్టి - పొండు నిండుసభను గొప్పపుంగవులార. గీ॥ ఓడినారని తలపోయువాఁడమిరు - నాకుఁ బ్రత్యుత్తరంబును నీకమాన, ముద్రవహింపుంతురేని నీముచ్చటెఱిఁగి - ముందుపనిఁ జూడుఁడీ కొప్పరపుఁగవులార. క॥ శివరామకవికిఁబోలెన్ । జవాబునొసఁగకయె వ్యర్థగజంపునడిపినన్, వ్యవసాయముకలదు నుఁడీ । వ్యవధిం గయికొనక యిండు ప్రత్యుత్తరమున్,

అంగలూరు,
3-9-1913.

ఇట్లు, బుధజనవిధేయుఁడు,
త్రిపురనేని రామస్వామి.

గ్రన్ననఁ *గొన్ని పద్దెములు గానుక గొప్పవారి కంపె నా
చిన్నతఁ డొక్క సాహసము చేసె వచింతుము తత్స్వరూపమున్. ౧౩౨
ఉ॥ బందరునుండి పద్దెములు వారికిఁ బోస్టున బంపి మీఁద మా
కందఱకుఁ జేసె దానిప్రతి; యక్కట! నీ యాఁగుట యెట్టు? లిట్టులే

---

బందరు.

శ్రీ మద్గురవే నమః.

(ఇయ్యది కొప్పవరపువారికి వ్రాసినయుత్తరమునకు సరియైన నకలు.)

*1. చ॥ ఉరుకరుణాయుతుండును, సముచిత ధీమహితుండును, భక్తులం, దఱికిని గల్పకద్రుమవిధంబున నుండెడువాఁడు నట్టియా, తిరుపతివెంకటేశ్వరుఁడు తిన్నని చూపుల మిమ్ముఁ జూచి యె, ల్లరును ముదంబు నొందునటులన్ దయ, మీక జయమ్ము గూర్చుతన్. 2. చ॥ ఉరుతరధీవిశేష మహితోన్నతులార! గుణాఢ్యులార! కొ, ప్పరపుకవీంద్రులార! వినవచ్చెను మీదు ప్రతిజ్ఞ; యెంతొ సం, బరమువహించి నాఁడను, రమాపతి మీకు జయంబు నిచ్చు, నా, తిరుపతివేంకటేశుల నెదిర్చి గ్రహింపుఁడు వారిమీసముల్. చ॥ ధనముగడించి యుంటి రవధానములం బొనరించి మీ రలిం, దనుక శతావధాను లనునామముతో; నిఁకమీఁద నట్లు గా, దనుచు శతావధానములనక్కడనక్కడఁ జేసిపండితుల్, వినుతియొనర్ప మీసములఁ బీఁకుఁడు నూతననామధారులై. 4. గీ॥ తెలుఁగు తిర్పతి వెంకటేశులకుఁ గూడ, వచ్చుఁ గావున నోడింప భారమగును, గాని వారికి నేత్రావధానమందుఁ, బ్రజ్ఞలే దందుమీరు గెల్వంగలారు. 5. క॥ నేత్రావధానమది న; ర్వత్రజయంబిచ్చు మీకు, వదలక దానిన్, మాత్రమె పట్టిన నప్పుడు, శత్రులనోడింప మీకసాధ్యంబగునే. 6. చ॥ వినుతగుణాఢ్యులార! యొకవిన్నపమున్ వినుఁడయ్య "గ్రుడ్డు పి, ల్లను గని వెక్కిరించినటులన్" గనుపట్టెను వీరియుత్త" మంచు నిట జనుల్ వచించిరది యెంతయు నామది నమ్మఁబోవనే, మనిన నియోగినాటఁ దగవా? యది నమ్మి మిమ్ముం ద్యజించుటల్. 7. మ॥ "సభమీరెచ్చటఁ జేయువార" లని ప్రశ్నన్ వేసిరవ్వారు, మీ రుభయుల్ మాపురికేగుదెంచియిట సభ్యుల్ మిమ్ముఁ గీర్తింపఁగా, సభ నేయింపుఁడు, తోఁచినంత వఱకున్ సాహాయ్యమున్ జేతు నా, కభిమానంబదిమీయెడం గలదు రం డా మోదముం బొందుచున్. 8. ఉ॥ "ఆరయ నీవు చేసెడిసహాయ మదెట్టిది? నీవి ల్లవాఁడ" వం, చూరక నెంచఁబోకుఁడు మహోదధివారినిబంధనంబు చే, కూఱఁగ

కొందఱు *స్కూలుశిష్యు లాకకొన్నిటి నంపిరి, మే మెఱింగిన
ట్లందఱు గాక యున్న జను లందఱు గొందఱు మాన్ప నేర్తుమే ౧౩౩

చ॥ "తిరుపతివెంకటేశులకుఁ దీవ్రముగా సభ కేగుదెం డటం
చఱిముఱి వ్రాసి కొప్పరపుటాయన దా సభ కేగుదెంచెనే?
"పరపర" వ్రాసి రమ్మనినఁ, బాఱుద మంచల స్కూలుఁగుఱ్ఱ లెం
చిరి యని తోఁచుఁ జర్చఁ దగఁ జేసిన యోగ్యులకెల్ల నిప్పనుల్. ౧౩౪

---

రాముఁడయ్యడవిఁ గోతులసాయముగోరలేదె? స్కు, శ్రీఘ్రగ్రహించ మీరు దయచేసి జయంబు వహించుఁడో బుధుల్. 9. క॥ తప్పక దయచేయుఁడు మీ. రిప్పరికి జవాబుదీని కిడుఁడు సరగున౯। మెప్పగనుఁడయ్య వైళమ? కొప్పరపు కవీంద్రులార! గుణమణులారా!

ఇట్లు

సుకవిపాదరేణువు,

వడ్లమన్నాటి నరసింహశర్మ.

VIth Form C. Division,

Noble College,

Masulipatam.

---

శ్రీమత్పరదేవతాయై నమః.

11-9-11 బందరు.

*గురువర్యా! చ॥ మనమున భక్తినిల్పెదను మాధవపాద సరోజ యుగ్మ చింతనపరిలబ్ధదివ్యకవితా వనితా మహితప్రభావ సం। జనితలసద్యశః కుసుమజాలవినిర్మితహారధారులై। తనరెడు వేంకటేశ్వరబుధాగ్రణిమీ మీవగుపాద కంజముల్ ఉ॥ ఇందులనుంచు పద్యముల నేనెరచించియు నచ్చువేయఁగా, నందియ మెండుగల్గితమసన్నిధి కంపితి వానిఁజూచి నా,కుందయ వ్రాయవేఁడెదను గొంకకయెట్టులు సేయుమందురో? యందులనుండుదోషములనన్నియుదిద్దుచునంపవేఁడెద౯ మ॥ తమసందర్శనమెప్పుడబ్బునని చింతాక్రాంతచిత్తుండనై, కుముదంబుల్ శశిఁగోరుభంగిఁదమవాక్పూర్ణామృతాన్వేష సం,భ్రమమేపారనెసంగువాఁడనిటథీ

క॥ ఎటు దోఁచిన సరియే మే, మిట లేశమెఱుంగ మెఱిఁగియే మెవ్వరి నాఁ
గుటకు యతించితిమో? వి, స్ఫుటముగ మనసమున్న దానిఁ జూపితిమిక దా.

చ॥ చరితము గాన వ్రాయఁ దగుసంగతి వ్రాసితి మంతె కాని యే
ఱుఁగరు మేము కొప్రమున కిట్టులు శిష్యుల రేఁపి పంపుసం
బరమున కొప్పవారమొ? స్వబాహుబలమ్మునఁ బోవువారమో?
యరులు నిజం బెఱింగియును నాడఁగఁ జూచ్చిరి వేఱురీతిగన్, ౧౩౬

చ॥ ఎఱిఁగిన దేకదా? జగతి యెల్లఁ గుశిష్యుల రామకృష్ణులన్
మఱి యలయిర్వురందునొక మానిసి కన్న బహుశ్రుతుఁడు కొ
ప్పరమున వారి కంపెనొక పత్రిక *"నేత్రవధానమందు వ
త్తురె" యని రామకృష్ణు లటుదూఁకఁగఁజేసి రనంగఁ జెల్లునే॥ ౧౩౭

---

రాగ్రేసరస్తుత్యని,త్యము లేఖార్థము చూచువాఁడఁగృపతోనంపంగఁబ్రార్థించెదన్
చిత్తగించవలెను ఇట్లు తమశిష్యుఁడు
కోకా రాజారావు, హైస్కూలు, బందరు.

"మ॥ రా॥ రా॥ శ్రీ. కొప్పరపు సుబ్బారాయశర్మగారికి...మ॥ "ధరణీచక్రము గూలఁగా వలదె! సప్తాంభోధి భాస్వద్వసుం,ధరభారంబు వహించి మించున లమాతంగంబులున్ వీడి; కొప్పరపుంబండితమానులారా? తమకున్ భాషాద్వయీ కావ్యనం,ఛరితుల్ తిర్పతివేంకటేశ్వరులతో వాదంబు శ్రేయంబొకో,,మ॥ కరిశార్దూలమృగేంద్రసత్తములు గంగాభంగకల్లోలలీ, ల విజృంభించి పెనంగుచుండఁ గవిమార్జాలాదిసంపూజ్యలీ,రవధానంబు రచింపబూనితిరహా? హాస్యంబె యార్యోక్తి యున్ శివుఁడుం దాండవమాడనాడ వెపిశాచీభూతభేతాళముల్...ఉ॥ చెప్పినమాట చెప్పకయె చెప్పఁగ నేర్తుఁగవిత్వధారగా, నొప్పిదమౌనిధంబున బుధోత్తములందఱు మెచ్చనీరమున్,దప్పికద్రాపుభంగివచనంబున గెల్వఁగరండు నన్న మెయా?,కొప్పరపుంవిశ్వరులకుందగదే మొకో?నా ప్రతిజ్ఞయున్......"

---

*విద్యాచర్చాపత్రిక,

"అయ్యా? తమకును బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరమహాకవులకును, ఒక మాసమునుండి జరుగుచున్న కవితా కలహంబును పత్రికాముఖంబున వింటిని

చ॥ పనిగొని రామకృష్ణులు "సెబాసు! బళి! యని", కొప్పరంపువా
రౌనరుచుతప్పు లన్నిటిని నొప్పులు గాఁ దలపోయు టేరెఱుం
గని? దలవారిబంధు వను కారణ మొక్కఁడె చూచి యట్లనన్
జనునె? యశక్తి దుర్జనత సర్వ విగర్హిత మెన్నిభంగులన్॥ ౧౩౭

క॥ ఇది యిట్టులుండె మమ్మున్ బదిబది, యాసీమ నున్న ప్రాజ్ఞులు పూజా
స్పదులుగ నవధానాదులఁ, బొదలించుచునుండి రరులు పురపురఁ బొక్కన్.

శా॥ ఆపైఁ గొప్రపువారిపక్షమున వా రాలోచనల్ సేసిరిం
కీపై నెయ్యది కార్యమొ? మీపురమునందే వారికిన్ సారెకున్
ప్రాపై గౌరవ మిట్టులౌనె? యిది యెప్పాటన్ సహింపంగ నోఁ
గోపం బానుటయే యనుగ్రహము గాఁ గూర్చుండి రవ్వారిటన్. ౧౩౮

సీ॥ చుట్టుపట్టులనుండి చూడ వచ్చినవారిసంఖ్య వందలకన్నఁ జాలహెచ్చు
వచ్చి "మాయూరికి విచ్చేయుఁ", డనువారిసంఖ్య యేఁబదికన్నఁ జాలహెచ్చు
"రాఁజాల", మన్న "దీగదురాక, యనువారిసంఖ్య యిర్వదికన్నఁజాలహెచ్చు
ఏమాట వినిచిన నింపుసై వినువారిసంఖ్య యొకొ వేలకుఁ జాల హెచ్చు
తే॥ గీ॥ పద్ధతినియోగులం దేరొ పట్టుదలకుఁ, నేగకున్నను నెల్లవా రేగి వారి
చుట్టునుం గూరుచుండెడి చూచుటెట్లు, త్రిమతములు వారిపక్షమై తిరిగిపోయె

శా॥ * ద్వైతాద్వైత మొకండు దక్క నఖిలద్వైతంబు నద్వైతమున్
శైవంబున్ మఱి వైష్ణవంబు నొకచ్ఛత్రంబుగా వారలన్

---

...సర్వసాధారణమైన యాశుకవితకేమి? తమకు నేత్రావధానంబున నెన్ని బిరుదులున్నవో...వానిని మీకంటె నతిశయించి కాఁకరపర్తి విద్వత్సభలో ది 20 సెప్టెంబరు 1911సం॥ రం తేదీని తత్తద్దేశంబుల నెఱవేర్చియుండఁదలఁచుకొన్నాను గనుక నీనోటీసు అందిన వెంటనే మీప్రజ్ఞా విశేషంబును గనుపఱుప నారోజునకుఁ గాఁకరపఱ్ఱు మీరు రాఁగోరెదను "లేనిచో మీతో విద్యాదర్పులకు రాఁజాలను", అని నాకొక జాబైనను వ్రాయఁగోరెదను....

ది 14—9—1911 సామవేదుల సూర్యనారాయణావధాని
నేత్రావధాని, అష్టావధాని, మకాం కాఁకరపఱ్ఱు అగ్రహారం, తణుకుతాలూకా

*ద్వైతాద్వైతము.

వర్తా:—అనఁగా? నిది యొకనవీనమతము, దీనికే పద్ధతినియో

బూవుంబంతు లపోలికన్ జూచెదరు. రేపు న్మాపు నవ్వారితోఁ
బోవ్రై యుండుఁ బురంబు వారివచనంబుల్ వేదముల్ వీరికిన్. ౧౪౨

చ॥ ఇతరులమాట కేమి? మది నించుక గోపము కల్గి యున్ననా
కుతుకము గూడ వారనినఁ గొండొక పర్వులు వాలు వారివా
క్ప్రతతి వినం గుతూహల మపారము గల్గియుఁ బోను వారిపెం
కెతనము నాకు నచ్చమియె కేవలమింతకు మూల మెన్నయిన్. ౧౪౩

ఉ॥ "పెంకెలు గారు సాధువులు పేర్మికి నిక్కాలు గర్వదూరు" లం
చంకిలి లేక చెప్పికొను నట్టిజనుం గల రల్లవారి; ని
శ్శంకగ వారు వారి కటు చల్లఁగఁ దోఁచుటయు న్నిజంబె యే
పంకము యస్త్రదాదులకు వారు రుచింపరు వేయునేటికిన్. ౧౪౪

ఉ॥ పాండితి లేని యీమనము పాండితిపట్టున వారి గెల్వ లే
కుండొక త్రోవఁ జూడవలె "హుమ్మను" వారిది మాపఁగా వలెన్
గండతనం బడంచుటకుఁగాఁ గబురంపితిఁగాని బెల్లపుం
గొండకవీండ్రుఁ డేమిటికిఁ గొంకెన్నను? "రా" నని యుత్తరం బిడెన్, ౧౪౫

తే॥ గీ॥ తిరి కూర్చుండి శెట్టి రీపైర మనుచు, నతఁడుకొండొక నిరసించినట్లువినికి
యితరులకు నట్లెతోఁచుఁగాకిదియునట్టి, దెట్లులగు? నాసనమునీయ రేమి మనకు.

ఉ॥ పండితపామరుల్ గలిసి వారలకే హితు లైరి వారలన్
గండడఁగించు టెట్లు? మనకక్ష జయించుట యెట్లు? తోఁప దా
కర్రుండు నుపాయ మంచుఁ దనగాదిలిపద్ధతి వారితోడఁ గొ
ల్వుండి విచారణల్ సలుప నుండొక నేర్పరి పల్కె నీగతిన్. ౧౪౬

---

గమనియుం బేరు, ఇది సదుద్దేశముతోడనే శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారు పుట్టించిరి, వైదికు లసురులనియుఁ దాము దేవతలమనియు 'వారిసిద్ధాంతము, ఆయాయంశము,' ద్వైతాద్వైత పదమే తెల్పెడిని, సుప్రసిద్ధాద్వైతము వీరికి నసురాద్వైతము, విస్తరము వారివిశ్వపత్యసురవిజయము లోనగు గ్రంథములవలన నెఱుఁగఁదగు. ప్రకృతకలహమునకుఁ గారకు లేతన్మతావలంబులలో స్వల్పసంఖ్యాకు లని చదువరు లరయుదురుగాక.

చ॥ అవమానంబది యెంత గావలయునో యాసర్వ మవ్వారికిం
జవిఁ జూపెన్ మనకొప్పరంపుఁగవి "మీసాల్మాట సామాన్యమే?
యెవ రెచ్చోఁ నలవారి నిట్లనఁ గలారే? యంతియే చాలు న
న్యవిచారం బిఁక నేలని? నా కొకయుపాయం బిందుఁ గన్పట్టెడిన్. ౧౪౭

మ॥ అవివేకంబో వివేకమో జరిగె నేలా "సంధి మిచ్ఛంతి సా
ధవ," యన్వాక్యముఁ బట్టి పోవుదము విద్వత్తాకవిత్వాభిజా
త్య విశేషమ్ములఁ జేసి యిందులకు వా రంగీకృతిం జూప రం
చు విచారింపకుఁ డట్లు కాపుటకె యీచో పూవహ్య మెబ్భంగులన్. ౧౪౮

క॥ కొఱుకంగ రానికొయ్యలు, తిరుపతివెంకటకవు లని తెల్లము సేయన్
బరికించితి సదుపాయము, గర మాలోచించి దీని గ్రహియింపుఁ డనన్. ౧౪౯

తే॥ గీ॥ వృద్ధుఁడిట్లను "బాగు నీవెఱవు; దీనఁ, గలదు కష్ట మొకండు లోకమునఁ
గొప్ప,రంపువారలసారులు గ్రామ్యకవులు, వారనేతాదృశు లటంచుఁ బేరుగలదు

తే॥ గీ॥ అట్టిచో సంధియనుటకు నర్థమేమి,యగు నని? పరికింపుఁ డదియసమర్థతకును
నపరపర్యాయమగు 'ననసతఁడువలుటి—,'నగునుమీరన్న నుడియు నేనరసినాఁడ.

గీ॥ కానియిపుడింతకన్నఁ జక్కటి—నియుపాయ, మొండుగనరాదు సభ సేయకుండ వారి
నిప్పరమునుండి పంపుట కింక నొకటి—,సాధనం బేది? యానతి సల్పుఁడనుడు

తే॥ గీ॥ కొంత యోజించి యావృద్ధుకొసకుసమ్మ,తించి రాజీకిఁదగునట్టి మంచిమాట
లెల్ల వ్రాయించి వ్రాళ్లు చేయించుటకును, బెద్దలగువారి నొద్దికఁ బిలిపించుటయును.

ఆ॥ వె॥ ఈనడించువార "లిహిహీ" యనెడువారు, పెదవి విఱుచువారు "మొదలలేని
శాంతి యిప్పుడేల చాల్చాలుఁ బొండు పొం" డనెడువారు నైన మనసునఁ దిగి

క॥ చనికడచినవృత్తాంత, మ్మును వృద్ధునితోడఁ జెప్ప నూగ మించుకయై
వనటం బడి తెప్పిఱి యే, మిని వోఁచక యుండె నపరిమితయోజనలో.

తే॥ గీ॥ "నే నిడుఁదుఁ గంటిలోఁ బ్రవేలు నీవునాదు, నోట వేఁబిలిదు" మన్నట్టు "లేటికిట్టి
సంధి" యని యెల్లరాడునాచందమేను, మొదటఁ దెలిసియుఁబంపితి మోసపోతి.

క॥ అని కొంత సేపు తన చే, సినయపలౌకికపుఁబనికిఁ జేతమ్మున నె
కిటిన నిగ్గుకల్మిఁ జింతం, గొనుచు నుపాయాంతరములకుం గడఁగు నెడన్.

చ|| మఱియొకఁ డిట్లుపలుక్ర— "మఱుమాట వచింపకుఁ డింతకన్న నెం
డరయఁగ రాదుపాయ మొకరైయెదుగు రేనియుఁ జాలు వా్రిల్లకం
దఱు నొనరించినంత విలువై చెలువారెడు నంతపాగా
దారక వలెఁ సరాసరిగఁ దూఁగెడువారుగ నుండఁగా వలెఁ. ౧౪౫

తే|| గీ|| శాఖ కొక్కొ-క్క-రుండు గాఁజర్ప చేసి, యేరి(వాళ్లచేయించితిమేనిఁ జాలు
సంధి కన్నప్పడేమని సమ్మతింప, రరయరే? "సంధిమిచ్ఛంతి" యన్న నొడువు.

సీ|| ద్వైతులకెల్ల నాతనిచేతఁజేయింత మద్వైతులకు నెల్ల నతనిచేత
నతనిచేఁ జేయింత మలవిశిష్టాద్వైతశాఖకెల్ల నతండు చాలువాఁడు
ఇంక ద్వైతాద్వైత మిందుఁ జేసెడివార లెందరేనియుఁ గల రెంచనేల
శుక్లయజుశ్శాఖ సుముఖులకెల్ల నయ్యనఘుచేఁ జేయింత మతఁడె చాలు

గీ|| తప్పెవరిదేనియగుఁగాక తగు మనుష్యు, లిరువురకుసంధిగూర్చుచో నేమిదొసఁగు
పైకినటియింతమిట్లుచే(వాళ్ళదొరకు, వఱకుఁబిమ్మటమనయిచ్చనుఱుకవచ్చు,

ఆ|| వె|| సంధి కొప్పిరేని "చాల లే" కందము, సమ్మతింపరేని "శాంతిదూరు
లంద మవల; దీనియట్టియుపాయమ్ము, మనకుఁ గానరాదు మఱియొకండు

క|| చెఱియొకటిగఁ బంపినఁ గొ, ప్పరమునకుఁ లాఘవంబు పైఁ బడ దెవరో
యొఱఁగినవా రెట్లాడిన, నరయరు, దూరగులు యోగ్యు లందురు మనలఁ|

తే|| గీ|| ఒకర్ల— రొకరికి నెవ్వట్ల నోడువారు, కారు తుల్యులుకయ్యమ్ముగలిగినప్పు
డేరి నేరు జయి...తురో? యింతలోన, సంధి చేసిరి పైవారుశాంతి గోరి, ౧౫౦

క|| అనుప్రథ గల్గిన మనకుఁ, ఘనతయె మనకవుల కింతకన్నను గొప్పం
గొని తేఁగలమా? మును పా, సనమేనియుఁ గోరు టీయశమ్ముననె కదా.

తే|| గీ|| ఆసనం బిడ నందుల కల్లవారి, మీసములు బీఁకుచు మటన్నబాన చాలు
నొవుడు మనవన్నగడఫలియించెనేని, "కోటలోఁబాగవేయుఁబో? కొప్పరంబు

క|| అనునతనిమాటచొప్పన, ఘనుఁ డావృద్ధుండు నలువఁగా నెంచియు వా్రి
ల్లనుకూలింపమిఁ గొండొక, దనుకఁ మాకడకుఁ గాగితము రా దయ్యెఁ

గీ॥ అంత బ్రాహ్మణకోడూరియగ్రజన్ము, లెల్లమమ్ము నాహ్వానించి యెలమి నెక్క
సభను గావించి మేటియుత్సవ మొనర్చి, గౌరవించిరి వైరులు కళవళింప,

## బ్రాహ్మణకోడూరు శతావధానము.

సుగుణకలితకవితావనితానేతలును సురుచిరాలంకారవిధాతలును నిలసితపాకత్రాతలు నఖిలార్థదాతలు నగు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల యవధానవిధానంబులంబరికించి యానందించి యీజంట సత్కరింపవలయు ననుతలంపున గుంటూరుమండలమందలి బాపట్లతాలూకాలోని బ్రాహ్మణకోడూరు నివాసులంద ఏకగ్రీవముగ నిర్ణయించికొని తద్గ్రామంబునకు వారలఁబిలువనంపిరి. కడచిన శనివారము 9-9-11 న వారలను, శ్రీమ న్మధ్వశాస్త్రసంపన్నులును బాలసరస్వతీ బిరుదాంచితులును, లలితగతి శతావధానధురీణులు నుభయభాషాకవితాధురంధరులు నయిన శ్రీకాశీ కృష్ణాచార్యుల వారినిఁ దద్గ్రామంబున కాపురజనులు రావించి గ్రామోపకంఠంబుననే యీత్రిమూర్తుల శిబికాసుఖాసీనులం గావించి నానావిధ హృద్యవాద్యంబుగ నూరేగించి బ్రహ్మశ్రీ పెరవలి సాగ్నతీశ్వర శాస్త్రులవారి భవనంబున విడియించి యుచిత సత్కారంబులు సలిపి సగౌరవంబుగ నాఁటికి వీడ్కొనిరి. అయ్యెడ నీక్రిందిపద్యముల నొక బాలుఁడు చదివెను.

ఉ॥ స్వాగతమయ్య! మీకు విలసత్కమనీయ యశస్సుధారస
శ్రీగురుతావిభూషిత విశేషనభోంతరరమ్యదీధితుల్
సాగరకన్యకాఘనకుచస్థలచందన చర్చితప్రభా
భాగమరమ్యదేహు లగునార్యులు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ స్వాగతమయ్య సత్కవిహృదంతరదంతురిత ప్రభావసం
ధాగమతర్పితాఖిలజనాహ్వచకోరులు దర్పవద్విరో
ధాగతహుంకృతిస్ఫురదహంయులు నిస్తులితోరుశక్తి నం
ధాగరిమావధానకృతిదాతలు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ స్వాగతమయ్య మీకు రచనాతిశయాన్విత కావ్య నద్యశో
భాగ విశేష వేష్టితవిభాస్వరలోకులు గౌరవ ప్రభా
సాగరమజ్జదుత్తమవిశాలయశస్కరిపుప్రభావు లం
హోగతిను ప్రజాశనమహోయుత తిర్పతి వేంకటేశ్వరుల్

ఇట్టియుత్సవంబునకు సుగుణ సంపత్తి గలపౌరులయుత్సాహము నైకమత్యమును గాగణములు, అన్నట్టు గాపులుం గరణాలు" వీరగ్రజన్ములు వీరలితరులంచు భేదభావంబుంచికొనక యెల్లరు సోదరుల భంగిఁ జెలఁగి మెలంగుటఁ జూడ నేరికేని వింత పుట్టింపక మానదుఆహా! యైకమత్యమున్ననిదియకదా యైకమత్యము, ఇట్టియైకమత్యముకదా భాగ్యత ఖండనాసుల సద్ధరింపఁ గలదు మఱియు నీపుర పౌరులు నలుగడలనుండియుఁ దత్ప్రజ్ఞాదర్శనంబునకై గౌరవనీయులగు మఱికొందఱఁ బెద్దలరావించి వారల నుచితవిధుల మన్నించిరి. వీరల సౌజన్యము శక్తి, సామర్థ్యము, నిష్కల్మషహృదయతయు, నెంతయు శ్లాఘనీయములు.

మఱునాఁడు 10-9-11 ఆదివారంబున నవధానసభ సేయ నిశ్చయింపఁబడియె, ఆనాఁడు భోజనానంతరము రెండుగంటలకు శ్రీనాగమల్లేశ్వరాలయపురోభాగంబున స్థాపింపఁబడిన నారికేళస్తంభవిలసితంబై పచ్చతోరణంబులరాజిల్లు తాళదళంపుఁ బందిట సభకూర్పఁబడెను, అందు నానాగ్రామ సమాగతవిబుధవరులును గూడియుండిరి. నాఁటిసభ కగ్రాసనాధిపత్యము వహింప శ్రీ కాశీకృష్ణాచార్యులవారు ప్రార్థింపఁబడిరి పిమ్మట వారియాధిపత్యము క్రింద నాసభ సుముఖంబుగఁ బ్రారంభమయినది. అవధానంబును ముగిసె అంతటఁ దద్గ్రామవాసులు నితరులును జక్కని మృదుమధురశైలిఁ గొన్ని పద్యంబుల, శ్లోకంబుల, రచించి యవధానుల కర్పించిరి. తదనంతరము సభ చాలింపఁబడియె.

ఈ॥ రంగారావు, బి, ఏ., డిస్ట్రిక్టుకోర్టు వకీలు.

---

(అవధానప్రారంభపద్యములు.)

చ॥ "వయసుగతించు చున్నదిఁకె వల్లవధానము,, లంచు సేము త
ద్దయు బతిమాలి యేటి కవధానములన్ సమకూర్చె దన్న "నా
దయ కొక్కఁడున్నె వార్ధకము తాత!,, యటంచు వచింపదే మొ య
ట్లయిన "తథాస్తు" నీయభిమతార్థమె తీర్చెదమమ్మ శాంకరీ॥ తి॥శా॥

శా॥ ఊరేగించుటె కాక మాయెడల మీయూరెల్లఁ జూపించు వి
స్తారోదారపుగౌరవమ్మునకు నేఘా యత్ ప్రతీకారమొ
ప్పారన్ జేయఁగ నేర్తు మేము; నవద్రాక్షాసారముల్ గొన్ని శ్రీ
వారిం గొల్చి గడించుకొన్న వెటులో మా ప్రకృత్తు మాలింపుఁడీ॥ వెం॥శా॥

(అవధాన పద్యములనుండి 2 మాత్రము)

(బ్రాహ్మణకోడూరు)

మ॥ గణనీయుల్ ద్విజు లల్లరాజులు యశస్సాంద్రుల్ కిరాటుల్ లస
ద్గుణగంభీరులు కమ్మవారు తనరన్ దోరమ్ముగా ధాన్యపుం
గణముల్ గోట్లుగఁ బుట్లు పండఁగల భాగ్యంబెందుఁ బెంపారు బ్రా
హ్మణకోడూరుపురంబు చెన్నలరు లక్ష్మ్యావాసమై వాసికై. 5

ఆంగ్లేయులప్రభుత్వము.

శా॥ పాఱంజొచ్చె నృశంసవర్గములు, దైవారంగ నీరెల్లచోఁ
బాఱంజొచ్చె సమస్తమానవులకున్ బల్ సౌఖ్యసంపత్తి పెం
పారన్ జొచ్చె సితాస్యరాజ్యమున "నాహా! యిట్టి రాజుల్ ముదం
బారన్ వర్ధిలఁగావలెన్ మనకు విద్యాసంపదల్ గావలెన్. 23॥

అవధానాంతమున నితరులు చెప్పిన పద్యములనుండి కొన్ని.

మ॥ సకలాంధ్రావనిపాలకోత్తమ సభాస్థానమ్ములన్ సత్కవి
ప్రకరమ్ముల్ దలలూఁచి మెచ్చఁగఁ గవిత్వస్ఫూర్తినైకావధా
నకళోద్భూతజయేందిరా ప్రథితసన్మానమ్ములన్ గాంచుచున్
"సుకవీభేంద్రమృగేంద్రు"లన్ యశముఁ గైకొన్నారు వీరిర్వురున్. 3॥

శిష్టాహనుమచ్ఛాస్త్రి.

---

మ॥ కవితాకన్యనుఁ బెండ్లియాడియు సుహాకళ్యాణముల్ పొందియున్
వివిధోపాయప్రధారణావనితనుం బెండ్లాడి తర్వాత నా
నవతుల్ గూడి యనన్యచిత్తు లగుచున్ సంసక్తి సేవించ నా
రవితారం బగుకీర్తిఁ జెందు కవిసమ్రాట్తల్లజుల్ మీరగా.

మొదలి నాగభూషణము.

---

సీ॥ ఎదిరిం[illegible]గన్న నీసడించెడిసాము లెవరికి ఛత్రమ్ము లెత్తువారొ
[illegible] సార్వభౌమ మహీంద్రు లిభము పైనిడి వేరియింపుగాంతొ

కలనేన్నరులచామగలఁ జూడ మనుదారల్ వీవన లెవరికి వేయువారొ
పైరాజులకైనఁ గప్పంబిడు టొప్పని యిను లెవ్వరికిఁ గానుక లిడెడివారొ
తే॥ గీ॥ అష్టహస్తులు భారతీ హావభావ, విలసనము లెల్లయెడఁ జల్లి వెలయువారు
వీరె కనరయ్య! తిరుపతివేంకటేశ, కవులు కమలాంగనాఖర్వగర్వహరులు.

ఇట్లు సజ్జనవిధేయుఁడు   తాడేపల్లివెంకటప్పయ్యశాస్త్రి.

---

సీ॥ భువిలోఁ బ్రసిద్ధమౌ భూసురాన్వయమందు నరుదారఁగా జన్మమందినారు
శైశవంబున నె శ్రీదేశికసేవచే మించు విద్యల గ్రహియించినారు
శతవధానప్రవీణత రాజసభలందుఁ బలుమారు జయములఁ బడసినారు
వాణిగృహీతాది భాసురగ్రంథముల్ చేసి సత్కీర్తిని జెందినారు
తే॥ గీ॥ ఇట్టి సుగుణంబులను గల్గునట్టిమీదు, భవ్యతరకీర్తి నెన్నంగ వశమె మాకు
కీర్తికాంతాసమాసక్తమూర్తులార: సరస తిరుపతి వెంకటేశకవులార.

తెలికపల్లి వీరరాఘవశాస్త్రి.

---

సీ॥ ప్రతివాదిజనభయప్రదమైన యస్మ్ముఖం బంతేవసత్ప్రౌళి కమృత మొనఁగు
సభ్యులకడ లిడఁజాలెడుయద్వాణి కబ్బంబులందు సౌఖ్యము ఘటించు
తథ్యాంశమన్న స్వతంత్రించు యద్ధాటి మిథ్యాంశమన్నఁ దామిన్నకుండు
త్రైలోక్యరంగనర్తకియైన యత్కీర్తి విబుధమనోగోష్ఠి విడువకుండు
గీ॥ నట్టిరుకవీశతలును శతావధాన, ధారణాధోరణీ చిత్రితప్రముఖులు
నస్మదీయ గురూత్తములవని నాయు, వునుయశంబును గనుచుంట పొనరుఁగాత
సీ॥ ఆంధ్రదేశావస్థితాశేషభూమిభృత్కోటీరమణిఘృణిఁ గూడియాడి
కవితాకృతానేకగణనీయపూర్వపుణ్యాతిశయంబులఁ జోతలంది
గోదావరీతీరకూలంకషామోఘపాండితీప్రథకు జీవంబు వోసి
కమనీయరచనాప్రకారకారణయశస్స్వీమంతినీలాస్యశేష మరసి
తే॥ సరసరసపుష్టి భావత్కనత్ప్రబంధ, బంధబంధురతత్కవిత్వప్రభావ
భావగంగాప్రవాహాభాస్వత్తరంగ, రంగకలనయఖండచిత్రంబునొనఁగె
సరసతిరుపతి వెంకటేశకవులార.
సీ॥ అన్యాదృశంబైనయశమును గర్హించుదోషజ్ఞబృందంబుఁ దూలనాడి
విషమపరీక్షావివేచనాప్రౌఢులౌ సంస్థానపతుల సంశయము దిద్ది
భిన్నభిన్నరుచిప్రభేదముల్ గల్గులోకులనెల్ల నొకటే మేకునఁ బిగించి

అష్టావధాన శతావధానామరభాషిత సాంగీతీబలను నొసఁగి

గీ॥ అఖిలదిక్కుల జయవైజయంతి కాని, జృంభణము మీకు ముందుఁగా నొసఁగియుంచు
తమపురాకృతపుణ్యంబు దగమెఁ బొగడ, సరస తిరుపతి వేంకటేశ గురులార!॥

అవ్వారి, సుబ్రహ్మణ్యశాస్త్రి

సీ॥ పట్టుమంచొక గీతపద్యమ్ము వ్రాయరాదా! యేమి నేర్పు లేదా యెఁ గాని
ఆశుధారయటన్న నసలె మాచేతఁగాదా! యేమి ధార లేదా యెఁ గాని
అవధానతంత్రంబు లందు మాబుద్ధి పోదా! యేమి మేధ లేదా యెఁ గాని
వాఙ్ముఖమ్మున మాదువక్త్ర మించుక సాగదా! యేమి మాటరాదా యెఁ గాని
గీ॥ మాకు ననుకొను పండితుల్ మహిని నేఁడు, లేరు కలరు గాని యీమేలు పోకళుట్టి
పడఁగ నవధాన మొనరించు వారు గలరె, ధరణిఁ దిరుపతి వేంకటేశ్వరులు దక్క.

కాశీ, కృష్ణాచార్యులు, శతావధాని.

---

సీ॥ కన్నబిడ్డలవలెఁ గాపాడి విద్యల శిష్యాళి కెప్పుడు చెప్పుచుంద్రు
సాహితీగ్రంథముల్ చక్కఁగ బోధించి పండితులను జేసి గ్రాలుచుంద్రు
సారకవిత్వంపుసరణిని నేరిపి సద్గ్రంథములఁ జేయ సాకుచుంద్రు
ఆశుకవితధార నలవడఁగాఁ జేసి ఛాత్రులఁ గనుఁగొని సంతసింత్రు
గీ॥ పుడమి వీరికి సరియగు పురుషు లెవరు, సరుఁడు నారాయణుండును బరమకృపను
వరుసఁ దిరుపతి వేంకటేశ్వరులె యగుచు, జగతి జన్మించినారలు సత్యమిదియ.

నోరి, నాసమచ్ఛాస్త్రి.

---

క॥ నిక్కనసీల్గినఁ దమకిప్పు, డెక్కడివారేని సామ్య మొనయరు నిక్కం
బిక్కరణి నేను వ్రాయఁగ, నక్కఱ యేమేలేదు జగతి యంతయుఁ బలుకున్.

వలివేటి, వెంకటనరసింహము.

---

☞ దిఙ్మాత్రము దాహరించితిమి, తక్కినవి యచ్చయియున్న పుస్తకము
నఁ జూడఁదగు దానివెల రు0—2—0 అణాలుమాత్రము.



క॥ [illegible]న పాదులో నొక, సదస్సుటులె జరిగె సంత ఛాత్రుఁడొకఁడు గో
విదమయ [illegible] కాలేజీ, సదస్సులో శతవధాన చతురిమ నెంచెన్. [illegible]

# శ్రీపినపాటిశతావధానము

ఆర్యులారా! జగత్ప్రసిద్ధులగు బ్ర॥ శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు గుంటూరు పురవాసులచే ప్రార్థితులయి అచ్చట బ్ర॥ శ్రీ, కాశీ కృష్ణాచార్యుల వారి అగ్రాసనాధిపత్యమున అవధాన సభ జరిపి స్వకవితా సుధాసారముచే తద్గ్రామవాస్తవ్యులను సంతసపఱిచిరి, పిమ్మట వారి సమావేశమును జేసికొనదలఁచి మేము అతికుతూహలాయత్తచిత్తులమయి మా గ్రామమునకు దయచేయుఁడని వారిని(ముప్వరను) ప్రార్థింపవల్లెయనిరి 21-9-11 తేదీని సాయంసమయమున వారు దయచేసి మాచే నొనర్పఁబడిన వాహనాద్యుత్సవముతోఁ గూడ పురజనులు జయధ్వనులొనర్చుచుండ మా గ్రామము నలంకరించి భోజనానంతరమున కొంతతమకవితామృతముచే మమ్ముల నానందిపఁజేసి నాఁటిరేయి సుఖముగఁబుచ్చిరి, మరువాఁడు అనగా 22-11-9 పగలు మ॥ శ్రీ॥ కాశీకృష్ణాచార్యులుగారి యగ్రాసనాధిపత్యముక్రింద పగలు 3 ఘంటలకు అవధాన సభ ప్రారంభింపఁబడెను నాఁటిదినంబున తెనాలిమున్నగు గ్రామముల లౌకిక వైదిక విద్వద్గణ్యులు విచ్చేసి సభ నలంకరించిరి, మరునాడు సభ బహుజనపూరితంబగుటంజేసి సమ్మర్దమెక్కుడు గలిగినందున 5 ఘంటలకుమాత్రము 31 మందికి ఏకైకపాదక్రమంబున జెప్పి ఆమరునాడు సాయంసమయమున తక్కినది పూర్తిచేసి సభికులను శ్రవణానందము నొందచేసిరి. అవధానము సంపూర్తిచేయుటకు పట్టినకాలము మొత్తము 8 ఘంటలలోపు అయియున్నది.

ఇట్లు విన్నవించువిధేయులు,

తెనాలితాలూకా — పినపాటిపురవాస్తవ్యులు.

---

(అవధానప్రారంభపద్యములు.)

ఉ॥ ఒక్కొకచోట నొక్కగతి నొప్పు జగదంబ! భవద్విలాస మ
న్నక్కఘటించు వస్తుచయమంతయు శక్తిమయంబు దానికిం
దక్కినవార లెందులకుఁ దారసమర్థులటం చెఱింగి నే
నిక్కృతికిం గడంగెద నిహో? యనిపింపకుమమ్మ శాంకరీ. 1

ఉ॥ మానియుఁ జేయఁబూనిరని మాపయిఁ గోప మదేల నీకు, మా
పై నెనరూను పేరకులపై ననురాగ మదేల? యొట్టులో

ఘూనితి మిష్ట పొమ్మనినఁబోయెదవే? ''ఊటశిరమ్ముఁ ద్రుంకిరా-జం
మానఁ బనేమి రోఁకలి, కెటో నటియింపు శతావధానమా॥ 2॥ వెం॥ శా॥

మ॥ స్వయమేపారశతావధానకవితాసామ్రాజ్యమేలించి త
చ్ఛయశోమూలము గాఁగ, నీవగటివేషా లెన్ని నాల్గింక, మా
వయి కేరే నరుదేర వారల నదల్పంజాలుధీశక్తి యి
చ్చి యెటో మన్నుట నీక భారమగు నీచిత్తంబు కామేశ్వరీ॥1॥ తి॥ శా॥

అవధానపద్యములనుండికొన్ని.

వైదికనియోగులకు సఖ్యమునుగూర్చి.

ఉ॥ ఏవ్వరు వైదికుల్? మఱియు నెవరు నియోగులు? నొక్కవిప్రులే
చివ్వకు డీకొనన్ గలుఁగు చేటిఁక౯; దక్కిన జాతివారికిన్
నవ్వఁగ నందుగాదె! యటు నవ్వఁగఁ జేయుట ప్రాజ్ఞధర్మమే?
యెవ్వగనైన వీరిరువు రేకముగాఁ జరియించు టొప్పదే॥7॥

బాసుగారిచట్టము.

మ॥ కలికిన్ గంటికిఁ బ్రీతిగొల్పునెడ వేడ్కన్ దేని నేనిన్ నరుం
డెలమిన్ గైకొనవచ్చు దాసివయినెందేఁ జేర్మి వో నప్పుడ
క్కలికిన్ వీడఁగవచ్చు నొండొకట భాగ్యంబున్న విశ్వస్తతోఁ
గలియన్ వచ్చును ''బాసు,, చట్ట మురరీకారంబు గావించుచో॥15॥

ఇప్పటివారి కవితా సంస్కారము.

శా॥ చారుశ్రీకములౌ నలంకృతులకున్ సన్న్యాసము ల్గల్గె శృం
గారంబెల్లను గారమయ్యె గుణముల్ ఖండంబులై పోయె సం
స్కారమ్మెల్ల నశించె భాషలకు దౌర్గత్యంబు ప్రాప్తించె సం
స్కారమ్ము ల్పొనరించువారికతనన్ సర్వంబు మాసెంజుఁడీ॥ 27॥

పృచ్ఛకుఁ డిచ్చినవిషయము.

సీ॥ శాలివాహనుని దౌశకమునఁ బదుమూఁడువందలయేండ్లపైఁ బార్థివాఖ్య
వత్సరంబున మాఘబహుళచతుర్దశి శివరాత్రితిథి రాజశేఖరుండు
వీరనారాయణాభిఖ్య గల్గిన రెడ్డి శంకరమునికకలంకదాన

మహరఁగానగ్రహారముగాఁగ నొసఁగె నీ పినపాటిగ్రామంబు మునుపు; నేఁడు
కారణంబెద్దియో గల్గి నేదీ యయ్యె నైనను బంట లత్యధికముగను
తే॥గీ॥ బండఁ జేసెడిహయాణుల ప్రాభవమున, సిరియు సంపదయునుగల్గి చెలఁగుచుండె
నెల్ల కాలమ్ము నీరీతి నెసక మెసఁగ, వృద్ధిఁగాంచుత మీపినపాటియూరు ॥41॥

## సభ జరిగినచోటు.

సీ॥ ఎద్దానితూర్పున నెసకం బెసఁగుచుండు లీలమై మదరాసు రైలురోడ్డు
ఎద్దాని వైశాల్య మెంచి కొల్పింతుమే నాలువందల గజాలై చెలంగు
ఎద్దాని దేహ మెంతే నొప్పఁ డేకు దూలములతోఁ డేకువాసములతోఁడ
ఎద్దానియంతరం బింపారు సత్ర్వవిపటలిచే సద్గవీపటలి చేత
తే॥ గీ॥ పేరుగోష్ఠంబుగాని యేయూరనైన, మఱియుఁ బట్టణములనైన వఱల దిట్టి
"హాలు,, నాఁ జనునిద్దాని నాలకొఱకు, కొల్లకోటామగట్టించెఁ కుతుక మెసఁగ

## సమస్యాపూర్తి.

శా॥ కుంచాలన్ గొలిపించి యిచ్చితిని గాసుగ్గిళ్లకై యుల్వలన్
గంచాలం దిడఁబోకు మన్న మిపుడేకర్మన్ బోదు సంసారి "పా
వంచాలం డిగి దప్పిగొన్నవిరసుబ్బా! నీళ్లు వేవేగదె,,
(మ్మంచాలన్ బిగియించె గుంజలకు నమ్మా! బిందియన్ దేగదే?)॥ 62॥

## సమస్యాపూర్తిః.

శ్లో॥ నహి సంతతిస్తు నరకార్ణవాపహా, త్యతిదుఃఖు మాత్మపితరం నిరీక్ష్య సా
తనయా దదౌ స్వతనయం తతస్త్వహో! (అనుజో బభూవ తనుజోఽపి యోషితః)

## అవధాన మొనరింపఁ జేసినవారు.

సీ॥ తూములూరికులాబ్ధిసోముండు విద్వద్విధేయుండు కోటయ ధీరుఁ డొకఁడు
పినపాటి వంశాబ్ధివిధుఁడు శ్రీవీరభద్రయకవిత్వరసప్రధానుఁ డొకఁడు
భళ్లమూడ్యన్వయవారాశిచంద్రుఁడౌ శ్రీరామనామకసూరి యొకఁడు
తూములూర్యన్వయేందుండు శ్రీసూర్యనారాయణాభిధకవిగేయుఁ డొకఁడు
తే॥గీ॥ లక్ష్మికాంత మొకండు సులక్షితుఁడయి, వఱలు నన్నము భొట్ల సువంశజుండు
వీరుఘటియించి రవధాన మారఁగఁ బిన, పాటిసాంబశివాభిఖ్య భవ్యుఁ డొకఁడు

## అవధానాంతమున నితరులు చదివినపద్యములనుండి కొన్ని.

మ॥ తమ సమ్మానముఁ జేయ శక్తియినుమంతన్ లేదు మీశక్తియి
త్థ మటంచున్ గ్రహియింపలేము నరనాథ ప్రార్థ్యవైరి యొప్ప కా
ర్యము చేయన్ సమకట్టినార మిట లోపాలోపముల్ దిద్దు మా
ర్గము మీదే యని వేఁడుకొందుము నమస్కారంబు గావించుచున్.

### చంపకమాలిక.

తరతమభావమున్ భువిని దజ్ఞులు పండితు లెల్లవారు గొ
ప్పరపు కవిద్వయంబునకుఁ బండితులై యలరారుమీకు నీ
వఱకె గ్రహించినార లది బాగుగ లోకము వారు గూడ నె
ల్లరును గ్రహింపఁగా మనములన్ బొడగట్టినకోర్కి పేర్మిఁ జే
కులఁగను వారికిన్ దమకుఁగూడను గమ్మలిఖించినాఁడఁ గొ
ప్పరమిట కేగుదేర దల వారికిఁ గార్యభరంబు పొండొకో?
..............దీనికిని సాటిగఁ గొండొకఁ జెప్పబోవఁగా
బోరకొనవచ్చునే! తెంచటఁ దోయజమిత్రుని ముందు దీపము
ద్ధరమగు? నేస్తముందటను దోమను బోల్పఁగవచ్చునే? ధురం
ధరమయి యెల్లమానవులఁ దానయి పూతులఁ జేయు గోవు ముం
దర ఖరమున్ మహేశ్వరుని దాపున రాక్షసవర్గ మెందు నుం
తురె! యనిప్రేక్షకుల్ తమమదుల్ బయిపెట్టఁగ నొప్పనట్టి శ్రీ
తిరుపతివేంకటేశ్వరుల దివ్య కవిత్వ మహత్త్వ మిప్పు డా
దరమునఁ జూడఁగల్గె ఫలితంబుగ నయ్యెను జన్మ మిత్తఱిన్.

తూ॥ కోటయ్య.

---

### ఉత్పలమాలిక.

నీతులు పల్కవచ్చుఁ బరనింద లొనర్పఁగవచ్చు నిట్టు లా
సేతు హిమాచలంబును బ్రసిద్ధి వహించు నృపుల్ సెబా సనన్
భీతులు త్రోవఁబట్టి తల వెనక్కుఁ ద్రిప్పుచు జాలుమండఁగన్
జాతవిరోధులై పలుతు సాగక యొక్కెడ మూల్గుచుండఁగన్

మాతులు విప్పి మొత్తువడి మూర్ఖులు కొందఱు తారుమాఱుగా
ఖ్యాతిఁ గలిగ్న పండితులయారె! భళీ; యహొరా! యన..."

దేవల్లి వెంకటప్పయ్యశాస్త్రి చందవోలు.

---

సీ॥ చక్రశంఖాది లాంఛన విరాజితుఁడైన విష్ణుఁడె యీ కాశి కృష్ణుఁడంచు
కవితాసరస్వతి ఘనత నాడించుగీష్పతి బహాకర్ణతిగ్పతి యటంచు
కుకవిత్రిపుర దైత్యకుంభిహార్యక్షుఁడౌ నీశుఁడే యీ వెంకటేశుఁడంచు
ద్రష్టలు [illegible]న భేదము లేక గనుఁగొన్న మూఁడుమూర్తులు నొక్కమూర్తి యంచు
గీ॥ మానవోత్తము లేమహామహుల నెన్న్ట్ల, వలుకుచుండెద రాకవిబ్రహ్మలను మ
దీయ హృత్పద్మమున వినుతించుచుంటి, నెలమిఁ దిరుపతివెంకటకృష్ణకవుల.

ఇట్లు విధేయుఁడు, దెందుకూరి సోమనాథశాస్త్రి.

---

సీ॥ శేషాద్రిగాక యశేషదేశీయుల నిత్యోత్సవములచే నెగడినారు
పట్టికాసులుగాక యడ్డులేక జనాళు లిడ్డకాసుల సంగ్రహించినారు
వరగూఢపదభోగవనతిగాక యగూఢపదభోగవంతులై పరఁగినారు
ఈశ్వరబిరుదు గ్రహించుటగాక కవీశ్వరబిరుదు గ్రహించినారు
గీ॥ కొండలకుమాత్రమే మహానందమిడుట, గాక యందఱ కానందఘటకు లైరి
యిప్పు డాతిరుపతివెంకటేశు మించి, రిలను నీతిరుపతి వేంకటేశకవులు.

చ॥ గురుతరలీల నీసభను గూర్చిన బుద్ధిమదగ్రకోటికిన్
సరసశతావధానుల కెసంగు సభాపతికిన్ సభాస్థలాం
తరసకలప్రజాళికిని ద్రష్టల కీ పినపాటివారికిన్
నిరతసుఖంబు నీప్సితము నీశగణం డిడఁ బ్రోచుఁగావుతన్.

ములుకుట్ల, వెంకటకృష్ణశాస్త్రి, శతావధాని.

---

శ్లో॥ ఉద్గచ్ఛన్తు శతా త్వరేచ కవయో జల్పన్తు నిస్సంకటం
మాత్సర్యా త్తదవితా ప్రశస్తివిషయే సత్కల్పనా చాతురీ

ధీమత్పణ్డితమణ్డలీహృదయసంతోషప్రదా సద్గుణా
నైవాన్యం సముపైతి కిన్తు భవతో జిహ్వాం విహాయ క్షణం

నేమూరి, శివస్వామిశాస్త్రి.

---

సీ॥ మీధారణాశక్తి మితిలేనిదనుటకు దంబా శతావధానంబె సాక్షి
సాహిత్యసామ్రాజ్యచక్రేశు లనుటకుం దమరుకూర్చిన పుస్తకములె సాక్షి
కాకవీశ్వరమత్తకరిహరు లనుటకుం గొప్పపుంగవుల నేకుటయె సాక్షి
అఖిలరాజన్యపూజ్యత నొంది రనుటకు బిరుదులున్నవి వేనవేలు సాక్షి
గీ॥ ఎలమి మిముఁ బోలు సుకవీశ్వరులు ధరిత్రిఁ గలుగ రనుటకు మాఱువలగ్గమిదె సాక్షి
విమలమతులార తిరుపతివేంకటేశ, సుకవిమణులార బహుళరాజసుకవులార ॥3॥

గాడ, కృష్ణయ్య, పెదకాని.

# గుంటూరు కాలేజీ శతావధానము.

చ॥ ఎఱుఁగడు పిల్లకాయ యెటులే నొనరించు శతావధానముల్
సరసులు మీర లెల్లయను సభ్యులు పేర్మి ననుగ్రహింపఁ దా
దరమునఁ దప్పులన్ విడిచి తద్గుణ నొప్పులు చూచి మెచ్చుఁడీ
తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యుని వృద్ధి కాముని౯ ॥ (వెం॥శా॥)

☞ అవధానపద్యములన్నియు వదలఁబడినవి.

.............................................

శా॥ నీకున్ శ్రీయును ధీయుఁ గల్గుత మఱి నీకంఠసారస్య మా
స్తోకంబై యలరారుఁ గావుత నినుం దూలింపఁగా లేరు దు
ర్ధీకుల్ గ్రామ్యశతావధానులిఁక వ్యర్థీభావమునుం గంద్రు గా
శ్రీకాంతారమణుండు నైకొనఁగదోయీ! ఛాత్రచూడామణీ. ॥3॥

మ॥ కుతుకంబొప్ప సరస్వతిం గొలిచి నేఁ గొంతార్జనం జేసితి
న్మతిమన్మఖ్యుని బ్రహ్మఁ గొల్చి మఱికొంత న్నేర్చితిన్ విద్య ని
చ్చితి నీకున్ మఱిఁ గొంత మందికి యశశ్శ్రీ నిల్పితీవో జగ
న్నుతనామా! శివరామ! నీకు నొనరింతున్ దీవనల్ హెచ్చుగన్. ॥4॥

మ॥ ఎదిరిం దమ్ముల నెఱుంగ కే యెవరొ మ మ్మాం తేని నిందించునా
యదన న్వచ్చితి వద్దు చొచ్చితివి ని న్నవ్వారు లక్షించ నై
రది లోకం బెటులో యెఱింగె సభ గణ్యత్వంబు నీ కిచ్చి ర
య్యా! దేసల్ నిండె భవద్యశంబు శివరామా! శాస్త్రచూడామణీ!॥ 5॥

సీ॥ నీతండ్రి వేదవిద్యాతత్పరుం డిట నున్నచో నెట్లు నిన్నెన్నునొకొ
నీతల్లి లోకవిఖ్యాతదివ్యచరిత్ర యుండి గన్నఁ డా నెంత ముదముగనునొ
నీయన్న విద్యావినీతితత్పరుఁ డిట నిపుడున్న నెంత టిమెలమిఁ గనునొ
నీతమ్ముఁ డవధాననిపుణుఁ డీకృతి గన్న నెంత యామోదమ్ము నెనయునొకొ
గీ॥ ఇది మహాత్మ్యంబు భవగంబు సీయెల్లబంధు; వులును బొందెడిమోదమ్ము గలిసియొక్క
నన్న నేపొంచె భరముఘనంబు మోయి, యెట్లు శివరామ! చెప్ప మోయూ! కుమార!.

మ॥ కలవిద్దెం బలుమంది కిచ్చితిని వీఁకం గొంద రెట్టెట్టులో
యెలమిం గూర్చిరి సంగనామ నిడి యొక్కేఁ గొంద రానందముం
గొలుపం బూనిరి నీకతమ్మున నఁ దగ్గుంగాక యాయొగ్గుఁ ద
గ్గులు; నేనే శివరామశాస్త్రి! మది పొంగుంగాక నాకుద్ధతిన్. 7.

శా॥ “సంతానం బది లేదు నా”కనుమనశ్శల్యంబు నీవైదుష్షీ
కాంతుల్ ద్రోచెఁగదోయి! తండ్రి! నిను వాక్కాంతుండుఁ దద్భార్యయున్
స్వాంతం బుంచి యనుగ్రహించి బహుధా సంతుష్టునిం జేయుచున్
మంతు ల్గాంత సమస్తలోకమును సమ్మానించుఁ గాత న్నినున్ ॥8॥

చ॥ “అలుకదినోడు లాయు,,వని యఁదురుగా కలిలోన, నల్వ దీ
వఱకె గతించె నిప్పటికి నాస్త్రఘు మనన్ జర నోరువిప్పి మ
మ్మరయుచునుండె మాభరము నంతయు నీతలఁ దాల్చి చేయు మే
ర్పడచినతోఁ బ్రవ నోయి శివరామకవీ! బహుశావధానముల్॥ 9॥

క॥ “య,,న్ననుచుఁగొందఱనఁగా,“బ,,న్ననుచుంగొందఱనఁగ బాలుఁడవయ్యున్
నిస్సీమ యశముగొంటి మహాస్వాగర!వృద్ధినందుమా! శివరామా!॥ 10॥

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని.

మ॥ జగతీనాథులు పెక్కు మంది ముదితస్వాంతంబునం గానగా నలం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శగద్వావింశతిం జేర్చి హ

చ్చఁగ మా యేలినయీయవధానకవితాసామ్రాజ్యభారంబు మో
యఁగఁ బూనంగదవయ్య తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై॥ 1॥

మ॥ రిపులేతెంచిన రూపడంచుచు ధరిత్రీనాథు లర్పించు న
య్యుపదల్ గైకొనుచుం బ్రమత్తుఁడవుగా కుద్యన్మవేందుండవై
విపరీతం బగు శ్రోవఁబోక కవితావీరుండవై వర్ణనీ
యపరాక్రాంతి వహింపుమయ్య శివరామయ్యా! చిరంజీవివై॥2

శా॥ బాల్యోద్రేకముహై నెదిర్చితివి కొప్రంపుంగవిం గ్రంథసా
కల్యంబుం బొనరింతొ లేదొ యని నీకై కొంకు నన్మన్నన
శ్శల్యం బిప్పటి కూడఁదీసితివి వత్సా! సత్ప్రభాశోభివై
కల్యాణంబులఁ బొందుమయ్య! యిఁక నీఁకన్ శిష్యచూడామణీ. ॥3॥

మ॥ అవనీదేవులు నిస్సమానకవితావ్యాహార వారాశిసం
భవపీయూషరసాభిలిప్తలలితవ్యాహారనీహారులై
యవలోకింప శతావధానమున మాకానందముంగూర్చి గౌ
రవము స్సల్పితివయ్య మాఋణము తీఱన్ శిష్యచూడామణీ. ॥4॥

శా॥ స్వర్లీలావతులెల్ల రద్భుతపదవ్యాహార మేపార మా
చర్లబ్రహ్మసుధీగురూత్తమునివాచాపూర్తిఁ గీర్తింపఁగా
గీర్లాభంబునుఁ గోరిమాదరికి భక్తిన్ శిష్యులేతేరఁగాఁ
దర్లంజేసితి వస్మదీయగురువిద్యావంశచూడామణీ. ॥5॥

దివాకర్ల, తిరుపతిశాస్త్రి, శతావధాని.

సీ॥ శతవధానవిధానసందర్భములనెల్ల నేర్చి దిక్కులఁ గీర్తిఁ దార్చినావు
అవధానమునఁ బెట్టినట్టి చిక్కులనెల్ల నూర్చి నీవని నీవ తీర్చినావు
నదుము క్రుంగఁగ వ్రాయి నచిమివాగలకష్టమూర్చి నీతిని వారిఁ దేర్చినావు
పున్నామనరకంబు పోవునా? యనుచింత దీర్చి యొజ్జకుఁ బుష్టిఁ గూర్చినావు
గీ॥ మేలు, శివరామశాస్త్రి! నిన్నోలిగురుని, కనుపమయశంబు ఘటియించునట్టిశిష్యుఁ
డరిది, గురువులతోఁ గుస్తిపట్లాడ కెపుడు, గురుయశఁబుల నార్జించికొనఁగవయ్య.

కాశీకృష్ణ, శతావధాని.



క॥ మాకును మాశిష్యులకు న, నేకులు ప్రాజ్ఞు లిటు లెల్లయెడఁ జేసెడియ
స్తోకపుగౌరవముల కల, లోకిను లెంతేని జింతలన్ జివికి వెసన్. ౧౬౯

గీ॥ యత్న మెంతేని యొనరించియు "విశద, భాష్యఁదగుశబ్దలోనభసనుఘటించి
రానభావిశేషంబుల నరసి తీర, వలయు నంతియె యంబరీ నీ వరయ లేదె.

గీ॥ వాని "కలవాటులేనియాసాసనములు" కొప్పరపుసాము లానరింపనొప్పికొనరు
పావనీ నేమి నేతురు వారిఁ బట్టికొనిన, గ్రహములనుబట్టి మిక్కిలి కష్టపడిరి.

క॥ "తాటికెగఁద్రాఁకఁబూనిన, చోటన్ మఱియెంతదనుకఁ 'జూచో'" యనుచున్
మాటికి నెగఁద్రోయుచు, రను, మాట కుదాహరణముగ శ్రమంబది యొప్పెన్.

గీ॥ కొప్పరం బవధానంబు కొలకుఁబూచి, *వశము గాకపడెడిభంగపాటులెల్ల
మాపయునిబోల్పఁదొడఁగిరిమంత్రబలము, చాలఁగలమాటలౌకికాచారవరులు.

మ॥ అవధానం బెటు చెడ్డ నేమి, "బళి, మే, లాహా, జగ మ్మందు లే
రవధానుల్ మఱి యొక్క రిట్టి" రని యాహాకారముల్ వ్రాసి తా
నెవఁ డో పత్రిక కంప దానిఁ గని "యిట్లే నిక్క మంచున్ జగం
బవలోకించు మనమ్మునందు నిజ మేలా తేలు నప్పట్టునన్. ౧౭౪

ఉ॥ §"బాగుగ నుండెఁ గొప్పరపువారి" దటంచు లిఖించునప్పుడున్
దాఁగియె గిల్క గెంతఱొ హుటాహుటి వ్రాఁతలు దాఁగనేల? యే
వాఁగుడొ వెళ్లఁ బెట్టునెడ వ్రాయనకాఁ డటు నేయఁ గాక "మేల్? 
బాగు? భళా? భళా" యనెడిపట్టున దాఁగుట కర్థమే మగున్. ౧౭౫

---

*ఈభంగపాటులనుగూర్చి పూర్వరంగము 108, 109, 110, 111, 112, పుటలుచూ.

§(1911 సం॥ రం 13వ అక్టోబరు తేదీ, ఆంధ్రకేసరి పత్రికనుండి.)

(గుంటూరి శతావధానము.)

...సభ అసమాన వైభవంబుతో జరుపబడినది. 51 పృచ్ఛకులకు నిరాఘాటముగా జరుపబడినది. అవధానపుపద్యములైనను ప్రబంధపద్యములను మించియున్నవి యందియంతయు జూచినతోడ ప్రతిపక్షులకు నోరెత్తుటకున యున్నను నందుదారికిన దికాదు అంత సభానంతరమున ప్రతికక్షివారిచే కూడ మెప్పువడసిరని వ్రాయుట

క॥ కలనిజమెల్ల నిటులె యా, కలహమ్మునఁ దెలిసికొనినఁ గాక తెలియ దే
వలుగో పేర్మార్చి యెదో. గిలికెడి నిజ మెట్లు తెలియుఁ గృతబుద్ధులకున్.
ఉ॥ ఇయ్యెడ భిన్నభిన్నతను వేటికి నెత్తిరొ? వృత్తిపాటికా
మయ్యయు, రామకృష్ణులును, నందఱ దాఁటెడి కాళ్లమూరినా

---

కు గడునంతసిల్లుచున్నారము యిదివర కీగ్రామంబున జరిగిన సభలలో నేదియు నింత జయప్రదముగా జరిగి యుండలేదు,

ఇట్లు, యథార్థవాది.

---

(ఆన 1911 వ సం॥ అక్టోబరు 4 వ తేది ఆంధ్రపత్రిక నుండి.)

గుంటూరు సమాచారము.

గతనెల 18 వ తేదీని గుంటూరుతాలూకా ''విశదల'' గ్రామమున కొప్పరపు సోదరకవిశ్రేష్ఠుఁడగు బ్రహ్మశ్రీ వెంకటసుబ్బరాయ శర్మ కవిగారిచే శతావధానము జరిపింపఁబడినది. నాటిసభకు బ్రహ్మశ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. నాటి శతావధానమునకు గుంటూరునుంచి యుద్యోగస్థులు, విద్యార్థులు, న్యాయవాదులు, పండితులు, కవులు సుమారు 150 మంది వచ్చియుండిరి. వారికందఱికి పిండివంటలతో సహా భోజన సదుపాయములు జేయబడినవి. వీరిధారణాశక్తియును, సమయోచిత యుక్తి శక్తులును, కవితాపటుత్వమును' మేధాశక్తియును, శ్లాఘనీయములు. సభానంతరము కొందఱు పండితులు, కవులు తమయుత్సాహములను దెలుపుచు గొన్నిపద్యములను జదివిరి.

ఒకపృచ్ఛకుఁడు.

☞ ఇట్టివ్రాఁతలు పెక్కులు, లోపల నిజమెఱిఁగియుఁ గప్పిపుచ్చి శాఖాభిమానమును వెల్లడించునీవ్రాఁతలోఁగూడఁ జక్కఁగఁ బరికించువారికి ‹‹విశదల”లో నవధానముకన్న భోజనమే కొండొకవెలు గనుతత్త్వార్థము దొరకకపోదు. అది యటులుండె, ఈరసాభాసావధానము మాయవధానముకన్న వేయిరెట్లధికముగ నున్నదని వ్రాసిన యతనివ్రాఁతను పూర్వరంగము 46 వ పుటలోఁ జూడఁగోరెదము.

రయ్యయుఁ జట్టిసింగయయు నట్టిరె నాఁ దగు పోచిపోత లీ
యయ్యలు పూర్వజన్మమున యం దొకరే యని తోఁచు నంబి కా. ౧౮౮

క॥ అవధానం బారీతిగఁ, జవుటం బడసువిత్తులట్లు సమయుడు శాఖా
యువతీమనోహరులు తమ, సువివేకము నెల్లఁ దెలుపఁ జొచ్చిరి పెలుచన్.

శా॥ వెంకటరామకృష్ణులను వీరికిఁ దోడుగఁ దెచ్చి తిర్పతిన్
వెంకన నోడఁ బుత్త్ర మిది వీ లని కొండలు వారికోసమై
చంకలు గొట్టికొంచుఁ జని సారము గన్గొని "సీ" యటంచు ని
ట్టింకుల నింకినట్లు జను లెంచఁగ వింటిమి సుమ్మి శాంకరీ. ౧౮౯

చ॥ "కునికిన బోసిన కన్పయిఁ గొండొక తాటిఫలమ్ము పడ్డ" య
య్యనువున రామకృష్ణు లిది యారసి యుండవలెన్ దెగించి యి
ప్పని పయిఁ బెట్టికొన్నఁ దమపాండితి బైటికి రాదె దూరపుం
జనులు సమీపగుల్ బలె స్వశక్తిమహత్త్వ మెఱింగి నవ్వరే. ౧౯౦

తే॥గీ॥ "ఎడమచేయియుఁ బుఱ్ఱచేయియు" నటన్న, సామెతయె వీరి కవధాన చర్యపట్ల
తకుఁ సామగ్రిలోన భేదంబు బోలెఁ, తెనుఁగుఁ గొవ్రింబునకు రామకృష్ణులకును,

ఉ॥ వచ్చిన రాకయున్నఁ దమవాకులఁ, దోడుగ నంపుటేనియున్
మెచ్చు ఘటించుఁగాకి యనుచు మేటులు సేటులు "శృంగభంగముల్"
వచ్చిక మోఁపులుంబలెనె వంపిరి పాపము! రామకృష్ణు లే
మిచ్చఁ దలంచిరో! నిజమె మేటి బయ లౌ నని తా రెఱుంగమిన్. ౧౯౨

ఉ॥ వెంకటరామకృష్ణులవివేకవిశాలపు 'శృంగభంగమున్'
జంకల నూని జన్మదివసమ్మున నే యసధీనశాప్తి ని
ట్టింకులు గొన్ 'శతఘ్ని'ఁ, బఠియించుచుఁ గొవ్రిపువారి బందుగుల్
సంకపుఁదోవలం బడి స్వపద్ధతి వెళ్లఁగఁ బెట్టి రంతటన్. ౧౯౩

తే॥గీ॥ బందుగులటన్న దగ్గఱివారు కారు, ఏకశాఖీయులని యె నీవెఱుఁగుమంబ!
వారు లోలోనఁ గొప్రంపువారి నత్తు, నెఱుఁగ రనుకొను మెఱిఁగియు నిట్టులెరి
తే॥గీ॥ ఒకరొ యిర్వురో తక్కినీయోగులందు, గొప్పరపుధారయన సొప్పకొనని వారి
కాని యానన చర్చాభిమానదూన, మాన సాంతరులై మేను మఱచిచెడిరి. ౧౯౪

సీ॥ "పండితబ్రువ", యంచుఁ బండతిట్టులు తిట్టి నెవ్వాఁడు తన హైన్యమెఱుకపఱచె,
"సత్యవాది", యటన్న చాటుపేరున లేనిపోనివాదుల నేఁడు పూని వ్రాసె,
అతని కెక్కుడుగ 'యథార్థవా'ద్యభిధానమున నెవ్వఁడు లిఖించె ననృతములను,
వంటబ్రాహ్మణునుత్సవమ్మున కెవ్వాఁడు తనయశ్వము నొసంగి ఘనతఁ జెఱిచె
తే॥గీ॥ కొనియె నీసల్వురును మఱికొంత మంది, దక్కుమాయందు ద్వేషంబు దగులు జనులు
లేరట నియోగులందు నివ్వారి కతన, వృథగ నెందఱికో చెడ్డ పేరు వచ్చె.

మ॥ జననీ! కొప్రపువారి వక్షమది నీచంబో ఘనంబో! కనుం
గొనుమీ! వంటనియోగి నశ్వముపయిన్ గూర్చుండఁ గాఁ బెట్టి యూ
రున నేగించిరి వాద్యఘోషములతోఁ గ్రొంగ్రొత్త దీపాలతో
"నననయుల్ వీరికి బుద్ధి లే"దని పురం బాబాలమున్ గోలగాన్. ౧౮౮

మ॥ శివరాముం డవధానమున్ సలిపి వానిన్ బేర్చుడన్ వానిగా
రవ మొప్పన్ ఘనులట్లు చేసిరని మోర్వన్ లేక కొప్రంబు వా
నవధాన మ్మిట్లు చేయఁ జాల డెటులట్లో నుత్సవం బంచుఁ గుం
దు వెలార్చన్ దమపాచకాధముని నెంగుం దిప్పి రప్పట్టునన్. ౧౮౯

తే.గీ॥ దీనిచేతనె సకలంబు తెలిపినట్టి, దస్యెఁ బ్రాజ్ఞుల కిఁక నన్య మనవసరము
ఐన నాయాయి సందర్భమంతొ యింతొ, తెల్పుకున్న దూరగులకుఁ దెలియు పెట్టు

చ॥ "విశదల"లో వధాన మది వెల్గ్రీఁ దోఁచిన మీఁదఁ గూడ శ్రీ
ర్విశయము దక్కు గుంటురుపురిన్ సభఁ బెట్టి చెడంగఁ జూచి "దు
ర్దశులకు నుత్సవం బనినఁ దప్పగ నుండు" నటంచు నెంచి యీ
పశుకృతి కిచ్చఁ జేసి నగుఁబాటుల పాలయి రంబరిలౌకికుల్. ౧౯౧

మ॥ అభిమానంబన గర్తపూస్థితని యోగస్థ్రేసరాధీన ముం
చు భయం బించుక లేక చెప్పఁ దగు నెచ్చో వార లర్థానికై
శుభదారంబు ననత్యమున్ శుభద మంచు న్నమ్మి భాషింతు రే
రభసప్రక్రియ కేని సిద్ధపడి యారంభింత్రు దుర్వాస్యహృతుల్. ౧౯౨

క॥ కుకర్కశ్వము పై నెక్కిన, నిక్కపు సంతోస మందు నిపుణులు కవులం
దెక్కువ తక్కువ లరయుదు, రొక్కొక్క యుడివిన్న నవ్వరొక్కొక విబుధుల్.

క॥ ఇదియిటులుండఁ, దత రాజీ, కుదిరింపఁగఁ బత్రమది యొకొండు మునుపె యీ
నడమతులు వ్రాసియుంచిరి, కదని తచ్చరితమ్ము వినికి గావింతు మిఁకన్.

క॥ ఇరువదినాలుగు దినములు, పరిపరి యోజించి తుదకుఁ బత్రిక మా కి
చ్చిరి తెచ్చి *గౌరవస్థులు, మతిమూఁగురు; దానిఁ గాంచి మదిముద మొదవన్.

ఉ॥ అంతకుమున్నె "పత్రి మిటులా గత మా, నని విన్న నాఁడె వా
క్కాంత యనుగ్రహమ్మున నొకానొక కల్పన దోఁచఁగా,, యశః
కాంత వివాహముం,, గుఱిచి కట్టియ యుంచిన పద్యసప్తకం
బెంతయుఁ జేర్చి, మీరు విని హెచ్చిన మోదము గాంచి రయ్యెడన్. ౧౬

---

*(1911 సం, అక్టోబరు 20, తేదీ కృష్ణాపత్రికనుండి.)

బ్రహ్మశ్రీ తిరుపతివెంకట కవీశ్వరుల సముఖమునకు. ఈదిగువ సంతకము చేసిన వారు నమస్కరించి వ్రాయువిజ్ఞాపన:—

ఈపురమున నీమధ్య శతావధానసభ జరిగినది మొదలు దమకును గొప్పరపు సోదర కవులకును వైషమ్యము లేర్పడి ఉత్తర ప్రత్యుత్తరములు నడచినవి. మాగ్రామములో తమ తమ మధ్యవైషమ్యము లేర్పడుట మాకు మిక్కిలి శోచనీయముగానున్నది. తమరును కొప్పరపు కవీశ్వరులును మాకు గౌరవార్హులేయగుట మాగ్రామమునుండి వాగలను మిమ్ములను సఖ్యపరచి పంపుట మాకు యుక్తమనియు గౌరవమనియు దోచుచున్నది. కావున మాయుద్దేశ్యమును మీరును అంగీకరించి మీరాసభ మొదలింతవరకు నొండొరులంగూర్చి వచించినవియు లిఖించినవియు మరల్చుకొనుచు నొకరినొకరు లిఖితరూపముగ తెల్పుకొని యెప్పటి స్నేహభావ మవలంబించిన మేము మిక్కిలి సంతసించెదము. మావిజ్ఞాపన నాదరించి మీవైషమ్యకారణము లను మరచి మాకు సంతసము కూర్పుదురని నమ్ముచున్నాము.

గుంటూరు. }
4—9—11 }

చిత్తగించవలెను.
ఇట్లు తమ విధేయులు.

యేకా రామయ్య, జి. రామనాథయ్య. వంకిపురం కృష్ణమాచార్యులు, నావపతి హనుమంతరావు, కొండ వెంకటప్పయ్య.

## యశః కన్యకాపరిణయము.

సీ॥ తారతమ్య మెఱింగి తరలి వచ్చెడియారు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
తప్పటల్ మ్రోగంగఁ దరలి వచ్చెడియూరు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
తరుణతాభరముమైఁ దరలి వచ్చెడియూరు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
తగుబాంధవులతోడఁ దరలివచ్చెడియూరు కొప్పరం బం చెఱుంగుదురు మీరు
తే॥ గీ॥ తిరువతియొ? కన్యకాదాత తెరువు వదలి, వచ్చుచో నింతయాతిథ్యమిచ్చు రాక
యున్నచో నప్పడే పెండ్లి సున్నయయ్యె, నొకరువారింపనేటికో యోగ్యులార. 1

సీ॥ కలదొక్క కూఁతురు కలిగెఁ బెండిలి కాకమున్నె వడుగు గాక మున్నె మాకు
నాంధ్రగీర్వాణభాషాంగనాతిలకమ్ము లిరువు రక్కన్నియ నెత్తి పెంచి
రీడేరె నెందఱో యొక్కన్నెఁ బెండ్లాడఁగా నెంచి యత్నించి కడకు దీని
చే నీసడింపుల నూనిపోయిరి తల నరయంగఁ దఱియయ్యెఁ బరిణయంబు.
తే॥ గీ॥ లేకయే పోయె ననుకొనుపాక మెఱిఁగి, కొప్పరపువారు తరలి రాఁగోరి రంత
నంతసించితి మంతనే జాఱఁదొడఁగి, రాగకుంటిమి తప్పేమి యోగ్యులార. 2

సీ॥ 'తల నరసిననాతిఁ గలయుట కామశాస్త్ర విరోధ'మని మదిఁ దలఁచిరొక్కొ
'ఉభయభాషలు నేర్చు నువిదఁ బెండ్లాడఁగాఁ దగ'మంచులోలోనఁ దలఁకిరొక్కొ
'పెక్కు మాటలు నేర్చు పెంకెపిల్లను గొన్న మాటదక్క' దటంచు మానిరొక్కొ
'ఎందఱో జంకిన యెమ్మెలాఁడిని గొన్నఁ బరువు దక్క'టంచుఁ బఱచిరొక్కొ
తే॥గీ॥ 'కట్నమే చాల' దనుకొని కనలిరొక్కొ, వారు గోరిన దిచ్చు మా నేరమేమి
ఎట్టులో పెండ్లి పొసఁగించితిమి లమిపైన. దన్యమునఁ బండితులఁ దనుపఁగలఁపుఁడయ్య. 3

సీ॥ వియ్యమ్మునకు వారె విందుల నంపింపఁ దుల లే దనుచు మున్నె పలికినాము
"కాదు కూడ,, దటంచుఁ గాల్వెకల్పుక రాగ "మంచిదే" యని సమ్మతించినాము
ఒకమీనమే కట్నమౌలిమైఁ గోరఁ దక్కిన మీనమును గూడ నునిచినాము
కన్యావరణదాఁకఁ గార్యంబొనర్చితి మంతలో సుముహూర్తమగున టంచు
సీ॥ దలఁచుచుండఁ బురోహితుల్ దగినవారు, కావలసి వచ్చిరంత టఁ గాలివాన
వచ్చి కథయాఁగె నిందలి పొచ్చె మెఱిఁగి, యేల నెవరు పెట్టెదరు మమ్మహీసులార. 4

సీ॥ "ఎంత మీనమ్మైన నివి వెండ్రుకలె,, యంచు నీసడించిన రోసమేమి మాకు
"వైదికకన్యక వలదు తైకొను,, టంచు నీసడించిన రోసమేమి మాకు

"శాస్త్రంబు చదివిన సతియేల మా కంచు నీసడించిన రోసమేమి మాకు
"హెచ్చువంగడపు మీయింతి మాకేల, యం చీసడించిన రోసమేమి మాకు
గీ॥ మొదటఁగోరితి పిమ్మటఁ జదువు సంది, లెతిఁగిరా? యేమొ వెనుదీసి రెండుకేని
సమ్మతించితి మింక మీరెమ్మిగూర్పఁ, బూనుటది పునరుక్త మోజ్ఞానులార 5
సీ॥ రుద్రాక్షపూస లఋతఁ దాల్పువారికి బంగారు వారి కేబాంధవంబు?
పెలిబూది దాల్చువారలకుఁ దిర్మణి తిరుచూర్ణాలవారి కేచుట్టఱికము?
"ఇత్యర్థలితిభావ,, లేవేళఁ బలుకు—వారలకుఁ దెల్గులతోడ రాజియేల?
గురుపాదసేవఁ జేకొనినవిద్దియకు బాజారు విద్దియతోడ సఖ్యమేల?
గీ॥ ఏడ 'తిరుపతి, 'కొప్పరం, బేడ సహాహ, ఆహవమె కానిమతి వివాహంబె కాని
స్నేహమే కాని నూకెబ్లుచెల్లుఁ జెప్పుఁడ, సరసులార, గుంటూరువాస్తవ్యులార 6
సీ॥ గోదావరీనదీ కూలమ్మునకుఁ గొండవీటి కూపమ్ముతో వేర మేల?
ఆమ్రమానితరుజాల మలరుతోఁటలకు గోఁగాకుభూములమీఁదఁ గాఁకయేల?
ఎచటఁజూచిన నిప్పులే వాల్చుపొలములకేలయ్యె? జొన్న పొలాల చెలిమి
తిరుపతివేంకటేశ్వరున కంకాలమ్మ జాతరమీఁది విశ్వాస మేమి?
గీ॥ ఇంతమను గాలుద్రవ్విన దెవ్వరో యొ, యుంగుదురు మీ;రలెవరిస్వరూపమెట్టి
దో యెఱుంగుదు రరక యేద్రోవిధమున, మమ్ము నెవపెట్టనేల? యోమాన్యులార. 7

చ॥ పదపడి కొన్ని పద్దెములు పత్రికలోఁ *బ్రకటించి సంశయా
స్పదులగు లోకులం దనిపి ప్రాజ్ఞుల సంధికిఁ గొల్పు యోగ్యులన్

---

(*1911 సం, అక్టోబరు 20, 28 తేదీ కృష్ణాపత్రికనుండి.)

పైసంతకము లొనర్చిన వారికి నమస్కార పూర్వకముగా మా యొనర్చుకొను వినయపూర్వక పద్యమయ విజ్ఞాపనము:—

ఆర్యులాలా! 4-9-11 తేదీగల తమ పత్రిక 28-9-11 వ తేదీ సాయంకాలము సుమారు $5\frac{1}{2}$ గంటలవేళ మ॥ రా॥ రా॥ కొండ వెంకటప్పయ్య పంతులుగారు బి. ఏ; బి. బిల్; గొల్లపూడి రామనాధయ్యగారు బి. ఏ; బి. యల్; గోవింద రాజు శ్రీనివాసరావు పంతులుగారు బి. ఏ; బి యల్; అను నీపెద్దమనుష్యులవలన మాకు నందిన యపారానందము నొనర్చినది. దానిపైఁ గొన్ని పద్యములు భగవతి తోఁపింపఁగా నయ్యవి యన్నియును దమసన్నిధి కంపికొన దలచితిమి గాని

ముదమున ముంచి యచ్చటనె మోదమెలర్పఁ గవిత్వగోష్ఠి పెం
పొదవఁగనుంటి మావయికథోదయముఁ విసుమంబ పేర్మిమై ౧౯౭

(అప్పుడుప్రకటితమైనపద్యములు)

సీ॥ అనవసరమ్ముగా నాసనమ్మును గోరి యవధానవిఘ్నమ్ము నాచరింప
"మది యయుక్త", మటంచు నగ్రాసనాధిపుఁడనినఁ బిమ్మటఁగూడఁ బెనఁగఁబోము
పెనఁగియుఁ దుద కది గొనలేక సభవీడి యవలి కేగి యసూయనందఁబోము
అందియు నాటకాభ్యంతరమ్మున నుండు నప్పుడు పద్యమ్ము లంపఁ బోము.

గీ॥ ఎఱుఁగకే మీసములఁబట్టి యెట్లొ ప్రేలఁ, బడము దుందుడుకందము పలికినట్టి
పలుకుమూఁడులోకమ్ములనిలిపికొనఁగఁ, జాలుదుము పండితులయొద్ద సరసులార 1

సీ॥ ఒకని పెండిలిలో మఱొకఁడు తాపల్లకీ నిఱుక నుంకించు టెంతేనిఁ దప్పు
ఎఱుఁగక యత్నించిరే యంద మాపైనిఁ దెలిసియుఁ బెనఁగు టెంతేనిఁ దప్పు
అధ్యక్షుఁ "డిది కూడ"దంచుఁ జెప్పినమీఁద నేని యాగమి మటెంతేనిఁ దప్పు
అక్షరతత్త్వంబు నరయ కాపై భీతి దీఱి కాల్ద్రవ్వు టెంతేనిఁ దప్పు
తే॥గీ॥ "మీసముల", పద్యతాత్పర్యవాసనయును, మంత తెలియక ప్రేలాడు టెంతయేని
దప్పు "తప్పని" నేఁ జెప్పటొప్పుగాదు, పండితులచేతఁ జెప్పింపవలయుఁ జూడు 2

సీ॥ తిరుపతి వేంకటేశ్వరులకున్నయును గొప్పరంబున వారి గొప్పఁదనము
ఆంధ్రగీర్వాణభాషా౽వరత్వము గ్రామ్యభాషావధూటీప్రభావగరిమ
సనియమాశుకవిత్వమునఁగల్గు లోపం బనియమాశుకవననిర్ణిద్రమహిమ
అవ్యాజరచనాపటుత్వమును బూర్వసంచితపఠనప్రశస్తతయును॥
గీ॥ సభ యొనర్చినపైఁగదా! సహృదయహృద, యావగతమగుఁ, గాల్ద్రవ్వుటలఁతి
వారు, నేయఁదగుకార్యమా! యెంత చేవయేని, నుండియే తీరవలెఁ జూండిరా గుర్వులార!

---

గ్రంథవిస్తరభీతియును విలువగలతమ కాలమునకు లేనిపోని పని గల్పించినవార మగుదుమేమో యను సందియమును వెనుకంజ వేయించుటచే నందలిదశాంశమును మాత్రముఁ బంపికొనుచున్నారము. వ్రాసి పంపినచోఁ దమకుమాత్రమే యుండలి మంచిచెడ్డలు బోధపడునుగాని యావదాంధ్రలోకమునకును బోధపడవని పత్రికాముఖమునఁ బ్రకటించికొంటిమి. ఇందుఁగలతప్పులను మన్నింప వేఁడుకొనుచున్నారము. (తిరుపతివేంకటేశ్వరులు)

సీ॥ ఊరూర నూరేగుసుత్తరప్రత్యుత్తరముల కేలాగు నాశము ఘటిల్లు,
నొప్పు తప్పుగఁ దప్పు నొప్పుగాలిఖియించు "సత్యవాదుల" వ్రాఁతసమయుటెల్లు
ఇహాపరమ్ముల తెలుంగకే ప్రవర్తించు "యథార్థవాదుల" ధార్ష్ట్యమి మడఁగుటెట్లు
తిరుపతికన్నఁ గొప్పరమెక్కుడనెడియీపాటిబండలగోల దాఁటుటెట్లు?
తే॥ గీ॥ ఊరకే స్నేహమునుగూర్పఁగోరినారు, మీ రమాయికు, లివియన్ని యెరిక తనఁ,
గల్గెనో నుంత యోజింపఁగా భవద్గు, నత్వము నుతింతు మింక విజ్ఞానులార॥ర॥
సీ॥ అకటా! కవులకునపయశంబవచ్చెఁగా! యనెడి మీహృదయంబు నరసినాము
అది యాసనప్రసంగాధీనమనెడిమీయాశయం బాసాంత మరసినాము,
ఆప్రశంసను దెచ్చునమలాత్ములెవ్వరో ఆమూలముగ మున్నె యరసినాము
ఈ సఖ్యమునఁ గూర్చియుండుమూలమున వారనఘాత్ము లగుపూనిక నరసినాము
గీ॥ ఆపులించినఁ బ్రేవుల నరయఁగలరు, కవులు, రవి మెఱుఁగని చోట్లు గాంచఁగలరు
కొప్పరపుసోదరులె యెఱుంగుదురు నకల, మకటా! యాసనంబెంత చిక్కుదెచ్చె
సీ॥ "ఒడ లెఱుంగనిసీవమున్నదే" యందేని మాశక్తి నెఱుఁగమే మాన్యులార?
ఈఁతకు మించులోఁతెందేనిఁ గలదె? కా నిండయ్య యొకసారి నిండుసభను
వైదికత్వమున కేవం బేటి కెట్లొ మీసాలు దీయుంపుఁడీ నరసులార
విద్వద్వినోదముల్ వినుటగా ప్రమమున కేయపయశమ్మునుగూర్పవరయుఁడనఘు
తే॥గీ॥ లార! సత్యవాదులును, యథార్థవాదు లిప్పురమ్మునఁ బుట్టుటెంతేనిఁదప్పు
గాని విద్యలలో నేరఘునుజూరియెఱుఁగు! పూనికలు తప్పుగావయ్య పూజ్యులార!
సీ॥ "శ్రీకృష్ణబుధుండు కరమందు లిఖియించినన్నఁ జేసిన', దెంతసత్యమయ్య!
"అభిమానమున మమ్మునర్చించిరే కాని "శుద్ధమూర్ఖులె" యంటనూనృతంబె?
"రామకృష్ణులఁబట్టి రహింఁదిట్టినా" రన్నవ్రాఁతయెంతటి సత్యవంత మయ్య!
"నలుబది మందికే సలిపి రివ్వా" రని వెక్కిరించుట యేటిఫక్కి యయ్య!
తే॥గీ॥ తమరెఱుంగని దింద లేశమునులేదు! ఆసనమె తెచ్చిపెట్టె నీయనృతములను!
నిజము దెల్పి యశమ్ము చే నెగడరయ్య! వలదు జంపింక గుంటూరు వాసులార
సీ॥ "కృష్ణలో" వ్రాఁత నిష్ఠైని మీరొకసారి పరికింపుఁడీ హితవాదులార!
"దేశమాత" యొనర్చు దివ్యోపదేశమ్ము లరయుఁడీ యొకసారి యార్యులార!
"ఆంధ్రకేసరి" లోని యంశమ్ము లొకపరి చూడుఁడీ యుత్సైని శుద్ధులార
తక్కుపత్రికల యథార్థంపు వ్రాఁత లింకేనిఁ జూడుఁడి మహాజ్ఞానులార॥

గీ॥ సభను జరిగినయట్టి వాస్తవమదెట్టి? దెట్లువ్రాయుచునున్నారొ, యొఱింగి శాంతి
చేయఁ డీవ్రాఁత ప్రోలికిఁ జెడ్డయశము, గూర్చు నిజ మెట్లొ పైకి రానేర్చు నేని.

సీ॥ వేనవేల్ సత్యవిజ్ఞాను లుండియుఁ జెడ్డకీర్తిఁ గొనునె గుంటూరుపురము
సభ నున్న మీవంటిసరసులకన్న నాకాశంపు సూర్యుఁడా? కర్మసాక్షి
పంచభూతముల మా పాండిత్యతత్త్వంబుఁ జెప్పఁగా నవ్వించెదరె? పౌరు
లెవ్వరో యొకరిద్దఱే హేతువై పురమ్మున కప్రతిష్ఠ రాఁబోవునయ్య.

గీ॥ 'రజకువాక్యమ్ములనువిను రాము'లౌట, యుచితమయ్య మీవంటి యోగ్యులకు సకల
మొఱింగినందుకు ఫలమేమి? యిట్టిపట్టు, నందుదాసీనులగు టెంత యర్థమయ్య

సీ॥ "ఆసనం బొప్పలే"దని కోపగింతురా? అది గోరుటే పెద్ద యనుచితంబు
"అనుచితం"బనుట కేయాధారమందురా! కొప్రంపుకసిదాఁచికొనుటె సుండు
"అనుచితంబగు కోర్కె ఘను"లెట్లుకోరువా రందురా! అది ప్రమాదాతిశయము
మఱి ప్రాజ్ఞులకును బ్రమాదమాయందురా! $ "వారికే"యంచు నిర్ధారణంబు.

గీ॥ చేసి వ్రాసిరి వ్యాఖ్యాతృశేఖరులు, ప్ర, మాదముబు విశ్వసింపమి మాకుఁ దప్పె
అంతమాత్ర తానగంతులకనుమతింత్రె, సోదరులు చెప్పఁడయ్య! యో సూరులార.

సీ॥ ఉచితమో యనుచితంబో చేయు పండితుం డరయఁగావలె భవిష్యత్ప్రశంస
అని * భర్తృహరి చెప్పనైనఁ జూడక యేరి ప్రేరణమ్మున నొ దుర్వారు లగుచు
గాల్ద్రివ్వ యెన్నియో గాథలు ప్రకటించి తలకుఁదగని ప్రయత్నము లొనర్చి
"పండితసభ"యన్న పైఁ గొంత శాంతించి పండ్లబిఁక మొకింత వ్రాఁతయందుఁ

గీ॥ జూపి, ప్రాజ్ఞులసమ్మతి పాపకార్య, మనుచు మను వెక్కిరించిన యట్టివారి
సఖ్య మది మాకు లేకున్నఁ జచ్చిపోము, వృథగ నెపవెట్టకుండు సుప్రథితులార.

సీ॥ 'ఓంశాంతి'య నెడుమీయోగ్యత వేనోళ్ళ శ్లాఘింపవలెఁ జుండు సరసులార
ఈయూహ మీకప్పుడే పుట్టెనేని మీసములమీఁదికి వారు చనరుసుండు
అంతకొక్కింత పైనైనఁ బుట్టినవారు "కుచమర్దనములు" పేర్కొనరు సుండు
సకలమ్ము జరుగుపై శాంతిఁజెప్పుటకన్న నన్యాయముండునయ్యా! మహాత్మ

---

$ శ్లో॥ ప్రమాదో ధీమతామ" పీత్యత్ర, అపిశబ్ద ఏవకారార్థక ఇత్యభియుక్తాః.

* శ్లో॥ ఉచితమనుచితం వా కుర్వతా కార్యజాలం, పరిణతిరవధార్యా యత్నతః
పండితేన. (భర్తృహరిచూ)

గీ॥ లార! విద్వత్తులోఁ దప్ప నన్యవిషయ, మందుఁ గొప్పింపువారిసఖ్యంబు మాకు
సమ్మతము, దానిలోఁ గూడ సమ్మతింతు, మేని భారతి మ మ్మింక నీసడించు.

సీ॥ చౌరవమై నెదిరించి సొఱకాయకోఁతలు కోసినారు కటార్లు దూసినారు
అవధానమందు మిమ్మతిశయించెద మంచు వ్రాసినారు నవార్లు చేసినారు
మీఁది మీఁదికివచ్చి మీసాలపైఁ జేయి వేసినా ర్చేదుగుడుల్ గూసినారు
మసిపూసి యెట్టులో మారేడుగాయఁ గాఁ జేసినా ర్త్రమ్మిడఁ బాసినారు

గీ॥ పెనఁగి మామీనమింతేనిఁ బీఁకకుండ, నెదిరియవధానమున మమ్ముఁ గదుమకుండ
నేటి సఖ్యంబు మాకు? మీ కేటిభరము,సభను సమహూత్సుఁడయ్య! యశస్వులార.

సీ॥ బందరేమయ్యెనో? “వ్రిస్సు”లేమయ్యెనో? పుస్తకా లేమయిపోయెనొక్కొ
అచ్చేమి యయ్యెనో, ఆస్తి యేమయ్యెనో? వర్తకం బేమి కావలసెనొక్కొ
‘నూక్కొ’ లేమియయ్యెనో? బాలు రేమయిరొక్కొ? యుద్యోగ మేమూల నుండెనొక్కొ
ఇల్లేమియయ్యెనో! యితరమేమయ్యెనో? మిత్రవర్గంబు లేమి యయిరొక్కొ

గీ॥ వచ్చినదె రాక యయ్యె నీపాటికేము, సెలవు గైకొనుచున్నాము స్నేహభావ
ముంచి పంపింపుఁడయ్య! యేమునాడె! ‘వడ్ల,గింజలో బియ్యపుంగింజ’ గేస్తులార.

సీ॥ శ్రావణమాసానఁ జనుదెంచితిమి భాద్రపదమాశ్వయుజము నిప్పట్టణమునఁ
బూర్తిగాఁ గడచె నిప్పుడు కార్తికము వచ్చె నిప్పటికేని మాకింటి కేగు
నిచ్ఛ పుట్టుట లేద, యిదియెల్ల సీసీమవారియాదృతియు నుదారమైన
మీమైత్రియునుమాదు $ మీసాల మహిమయుఁ గొప్పింపువారి మిక్కుటపుఁ జేర్మి

---

☞ ఈక్రింద నుదాహరింపఁబడు పద్యములు, ప్రకృతము మద్రాసులో బి. యే (B, A. Honours) చదువుచున్న శ్రీ వారణాసి శ్రీనివాసరావుగారు తత్కాలమం దంపిన 200పద్యములనుండి సంగ్రహించి కైకొనఁబడినవి, గ్రంథవిస్తరభీతిచేఁ గొంచెముమాత్రమే యుదాహరించిన వమ్మవ్వారు మన్నింతురుగాక.

$మ॥ తొలుదొల్తన్ గలనూఁగు లేఁ జెమట నెంతో కాంతులన్ గుప్పఁ గై,తలఁ
జెప్పించితి ధారుణీపతుల హృత్పద్మంబులో వ్వార ని, శ్చలవాగ్ధోరణి మారుతిక్రియ
ము సాష్టాంగంబుగా వ్రాలఁగా. బళిరా! మీసమునీతు నీవనరి ద్రివ్వన్ జెల్లురా ని

గీ॥ యనుజుఁడీ! లేకయున్న మే మొకటనింత, కాలముండుటెప్పట్లనఁగల్గు బెట్లు
తక్కిన ప్రసంగములకేమి దైవకల్పి, తమ్ము లాజ్ఞ యొసంగుఁడీ ధన్యులార.

సీ॥ ప్లీడర్లమా? కాము, బీ.యేలమా! కాము, ధనికులమా? కాము ధన్యులార!
అర్థులమా! కాము, వ్యర్థులమా! కాము, ప్రభువులమా! కాము, ప్రథితులార!
దీనులమా! కాము, హీనులమా! కాము, మానులమా? కాము, మాన్యులార!
శుద్ధులమా! కాము, బద్ధులమా కాము, వృద్ధులమా? కాము, వేత్తలార!

---

న్నిఁకన్. మ॥ కలరుర్విన్ గడుసుక్కినవుల్ మదవశుల్ గర్వాంధు లవ్వారుబూ, తులనేనీతులటంచు రోఁతలను నెందున్ గైతలేయంచు ని, శ్చలదంభప్రతివిక్రమోత్సుకతమై సంచారమున్ జేతురా, బళిరా! యెల్లెడ,వారిఁగాంచినినుఁ ద్రిప్పన్ జెల్లురా,మీనమా? మ॥ తలమీఁదన్ దలపోసియీసుగొనిగర్వాలాత్మకూర్పార్థివేంద్రులసంస్థానములందుఁ బండితులునిన్నున్ దీయయత్నింపను, జ్వలవాగ్వాహినిగొట్టి వేసితివిక్రాంచత్పాండితీవైఖరిన్, బళిరా! మీనమ?నీకునీవసరి త్రిప్పన్ జెల్లురా నిన్నిఁకన్. సీ॥ నీనూఁగు నీపూడ్చనే యూడ్చ వప్పడే గురుకీర్తి కాపాడికొంటివయ్య, నృపసభాప్రకరసాన్నిధ్యంబునన్ జైత్రపత్రికలను దెచ్చి ప్రబలితయ్య, ఆశుధారాకవిత్వాశ నెల్లెడ నేగి యలరారు బిరుదంబులందితయ్య, వాగ్విలాసము దేల పలుకావ్యములువ్రాసి కవికేసరిఖ్యాతి గాంచితయ్య, గీ॥ నిన్నుఁ జెనయఁగ నెవ్వారునేర్తురనఘ,చాల రటుగాన పెంచఁగఁజాలు దీవ, త్రిప్పఁద్రిప్పంగ మఱిత్రిప్పఁద్రిప్పఁ ద్రిప్పఁ, దిప్పఁ ద్రిప్పంగ నినుఁ జెప్పి చెప్పవలయు॥ సీ॥ ఏస్థలనైక్కించి పృథ్వీపతులు గొల్వ నిక్కింపఁ జేసితి నీవకావె, వాదింపఁగా వచ్చువారిపాదంబుల నీటుగావించితి నీవకావె, వర్ణాశనస్థితిఁ బడయఁగా దగురాచనెమ్మినుద్రేకింతు నీవకావె, మాన్యంబు లిప్పించుమార్గంబుచూపించి నేస్తంబుఁ జాటుదు నీవకావ, తే॥ గీ॥మీనమా? గాథ గౌరవావాసమైతి, వెంతఁజేసితి ముక్ముందిఁ కెంతఁజేయఁ, జాలవెప్పడుఁగడుఁబెంచఁజాలియుండు,త్రిప్పఁదిప్పంగనినుఁజెప్పి చెప్పవలయు. క॥ నినుఁ దియుపదునుగలక, త్తిని జూడను స్నేహలుపేషు, తిరున నేమో, యని కొంకుదు ధరణికిఁది. క్కునవచ్చినఁ గాడెకొంతగాఁదగు శత్రూ. శ॥ కానర కూనర నుడి నం, తోసిల్లఁగ నానుకయింతతోసాగడిసీ, తీనభక్తైనరులేనర, మీనమ?నినుఁ దీయఁ గలుగుపేఘాగతికిన్. చ॥ మనమెటుచాలియుం

గీ॥ కవుల, మిప్పటి ’రూల్సు’ కుఁ గట్టఁబడము, ఘనులు * పండితరాయాదికవులు చూపు
త్రోవలం బట్టి పోదము దేవునైన, లక్ష్య పెట్టము † మాకు వల్లభులు లేరు.
సీ॥ తిరుపతి వేంకటేశ్వరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్పునాననపుఁ జర్చ
అల్లకొప్పరపు సోదరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్పునాననపుఁ జర్చ

---

దు మని మంచియుఁ జెడ్డయు నెంచకుండఁ బైఁ, జని మనపైకిఁ దెచ్చి కొని సర్వవిధంబులఁ జింత సేయ నె, య్యానపునఁ బాయుచే నేసితిమి! మున్గోకఁ డంతిన జాతియుంటిపం, చును దలపోయుచుండి రఁకఁ జాణుము కోపము నూనిమీనమా. చ॥ కలరు కవిత్వపార్థులును గల్గుదు రీకవితాభిమన్యులున్, గలరు కవిత్వభీములును గల్గదు రీకవిమాద్రిపుత్రులున్ గలదు కవిత్వధర్మమిఁకఁ గల్గునమస్తము గల్గకుండినన్, గలుగ వెనీవు కృష్ణుఁ డనఁగాఁ దగి దుష్టుల నెంచ మీనమా. చ॥ దుడుకుదనంపు పోకలకు దోసపు సేఁతల కాలవాలమున్, కదు నెగురంగ నంతకు సుఖంబుగ డిగ్గడు వారిపీఁచ మెం, ప్డఁ బఁగ ఘాలలో ధనము వచ్చిన వెంటనె నీవు వత్తువి, వ్వడు దయఁ బూనుమూ? యలుకఁ బూనక మానుము? నీవు మీనమా, సీ॥ అలబృహద్రథుశక్తి దరియనప్పుడ నీళ్లు మ్రింగిన విష్వచ్ఛమీనమెంత, దుర్యోధనుని గూల్పఁ దోడుగాఁ గృష్ణుండు మిణికిన వలలాంకు మీనమెంత, వాలిని వధియించ వంచనావృత్తిఁ బోయె మెచ్చయనిన రాము మీనమెంత, ఇంద్రజిత్తునికీలు నెఱిఁగి తుంచుచు దూడ నేసిన సౌమిత్రి మీనమెంత, గీ॥ నీవ మీనంబ వీసుహో నీవ కుంతి, తంబు, నాఁగలపలు నెత్తటి నెఱుంగ, వెప్పుడనయూనవిక్రమం శేవహించి జయము గొంటివి జగతి మీనంపుఁ బేడ, చ॥ అలఘుకవిత్వకీర్తిఁ గొననందఱకున్ దరమా నె? మించు నె, త్తులగమకింపనందఱకుఁ దోఁచు నె? తోఁచిన ‘జీలుగెత్తు’ గా, వెలయదె? మేకుమాటమఱిపించదె పెంచదె గిరతంబు; నీ, వలుగకు సంస్కృతాంధ్రకవితైకమహత్త్వము? చాలు మీనమా, మ॥ సుమనిర్యన్మకరందగంధకవితాశుద్ధాంతభృంగిరవో, పమభక్తప్రతిపత్తితో వెలయుచున్ బాండిత్యగంధానిలం, బమలంబై తెమలంగ లోకజనసమ్మాన్యస్ఫురత్క్రియం బాల్గు వో, కమనీయప్రతిభావిలాసము? నమస్కారం బిదే మీనమా. (13)...

---

* శ్లో॥ ... ప్రియతేవాఽపి స్వోత్కర్షం నైవ ముంచతి।
అక్షి నిర్వాణ మాయాతి నాఽనలో యాతి శీతతామ్॥

† నిరంకుశాః కవయః

విద్వత్కవీంద్రసంవిద్విలాసము మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ
కేవలకవుల యకించనత్వము మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ
గీ॥ నేటి యాసన చర్చకు, మీకు సత్య, వాదులకు, మాకును, "యథార్థవాదుల"కును
మఱియు మామీనములకుఁ గొప్పరవు సోద, రులకు, దీర్ఘాయువిడి నల్వ ప్రోచుఁగాక.

---

(పరిశిష్టపద్యములలోఁ గొన్నిమాత్రము.)

సీ॥ కాళిదాసునిమార్గ గరిమంబు నెఱిఁగినవా రంచు మిమ్మెంతు ధీరులార
భవభూతి యనుమహాకవిమార్గ మెఱిఁగినవారంచు మిమ్మెంతు ధీరులార
పండితరాయలదండితన మెఱుంగువా రంచు మిమ్మెంతు ధీరులార
ఆంధ్రకవీంద్రసిరాఘాటత నెఱుంగువా రంచు మిమ్మెంతు ధీరులార
తే॥ గీ॥ పలుకనేపలుకఁ జెప్పట్లఁ బండితుండు, పలుకనా నిల్పు నేగాని భయము గొనఁడు
ఇదియె విద్వత్కవీంద్రుల కింపునింపు, మార్గమని మీ రెఱుంగరే మహితులార.
సీ॥ మాకపకీర్తి సంపాదింపఁగా నెంచి దేశమాతకు దూఱు దెచ్చినారు
మాకప్రతిష్ఠ సంపాదింపనెంచి కృష్ణను సప్రతిష్ఠచే నడిపినారు
మాకు దుష్కీర్తి సంపాదింప నెంచి కేసరిని దుష్కీర్తిపాల్పఱచినారు
మాకు దుర్యశము సంపాదింప నెంచి యాంధ్రపుఁ బత్రికకు నదితార్చినారు
గీ॥ ఎందఱో "యథార్థవాదు" లిం కెందఱోని, సత్యవాదులిప్పరమున జననమంది
నారు శివరామశాస్త్రి యీనాఁటికిశివ, రాముఁడయ్యె మా కేలకొ ప్రంపుఁ జెలిమి.
సీ॥ సఖ్యపఱచి మమ్ము సాగనంపుటకు మీ చేయుయత్నము గడు శ్రేష్ఠ మయ్య
సాగనంపకము న్నె చనువాగమే కాని చుట్టుపట్టుల నుండు సూరివరులు
సభలు చేయుటఁ జేసి చనకిందు నిల్చితి మంతియే కాని సభాంతరమున
కింకను సోదరు లేలెంతు రని కాదు గాయత్రి సాక్షి నిక్క మ్మెఱుఁగుఁడు
తే॥ వారి నేమంబు గోరినవారు గాన, సంశయించుచు నున్నారు సకల మెఱిఁగి
నట్టిమాకడ డాఁచ నేలయ్య! వారి, వదలి చిరకాలమయ్యె సహృదయులార.
సీ॥ వ్రాసి యుండంటిరేని వారితోఁ బోరాట మాని కొంటిమటంచు మాన్యులార
వ్రాఁత వ్రాసిన యంత నే తప్పిపోవునే! కాల్ద్రిప్పువారి బింకంపుఁ గంపు
కాల్ద్రిప్ప పెట్టితో గనుఁ గొన్నవైఁ గాని నిదురఁబట్టదు మాకు నిక్కమయ్య
యీయూరఁ గాకున్న నేయూరనైన మీనమ్ముఁ బిఁకుట చూచి సఖ్య మంతఁ

గీ॥ జేసి విహితము మామీఁద నీసు గొనకుఁ, డనఘులార! దెబ్బను దిని నట్టిపులికి
నూరుపెటులబ్బు మీరెన్ని యోర్పుమంత్ర, ములను బఠియింతు రేనియు నలఘులార.

సీ॥ పుట్టుపుట్టునఁ జిట్టుబుట్టు లచ్చొత్తించి పట్టణంబునఁ బంచిపెట్టునాఁడు
"కాంపిటీష" నటం చెకామెకీ నరుదెంచు ప్రజలకోరిక భంగపఱచునాఁడు
అక్షరతత్త్వ మావం తెఱుంగక మీస లొగిఁ బట్టియయ్యాల లూఁగునాఁడు
ఎఱుఁగని! వాఁతలే వేవిరోగిలుఁ చుఁ "గుచమర్దనములు" పేరొ నెడఁ నాఁడు
గీ॥ మీర లేమైతిరో కొ! యిమ్మెయిని జేయి, కాలుమీఁద నాకులకు యత్నాలి వేల
యద్భవతి తద్భవత్వవ, యనెడిమాట, లెఱిఁగి వర్తింపుఁడయ్య యిం కేటిసంధి.

సీ॥ సత్యవాదియెవరో "జంట్లిమన్" పదవాచ్యుఁ డేమంట? యానూరి నెఱుఁగుఁడయ్య
అతని జ్యేష్ఠభ్రాత యగు "యథార్థప్రవాది" గూడ నట్టిఁడె యంట! చూడరయ్య
ఈయవతారమ్ము లెత్తువారలరసనాంచలమ్ములకు భర్మాంచితములు
భూషణమ్ములు దెచ్చి పొల్పుగా నర్పించి వాసిమై నూరేగఁ జేసి పిదప
గీ॥ సోదరులకును మాకును వాదుతీర్పఁ, బూనుఁడయ్య తరతమత్వములను బట్టి
మారు లనునంగుఁడయ్య మీమతివిశేష. పెల్లవిద్వాంసులును మెచ్చ నెనఁగుఁడయ్య

సీ॥ "తుకతోఁకను బట్టి గోదావరీఁదువా" తిరుపతి వెంకటేశ్వరులు కారు
"వేఁడినీళ్లనె యిండ్లు వెలిఁగింపఁ బూనువా" తిరుపతి వెంకటేశ్వరులు కారు
"గానమ్ముచేఁ జింతకాయలు రాల్చువా" తిరుపతి వెంకటేశ్వరులు కారు
"కంజాప్తు ధూళిచేఁ గప్పనెంచెడివారు" తిరుపతివెంకటేశ్వరులు కారు
గీ॥ హైకి రాకున్న నెవ్వరి పైకిఁగూడఁ! జనరు తిరుపతివెంకటేశ్వరులు వారి
భారతీతత్త్వమును జూచి వారివీరి! తారతమ్య మెఱుంగుట తగదె మీకు.

సీ॥ పిలువని పేరంటముల నొనర్పరు గౌరవార్హుల నవమానమంద నీరు
ధూర్తుల నైఁపరు ధూర్జటియైనను దగవుమాలినచోటఁ దగవుపెట్టి
తీరుదు రూరక యేరిని గదలింప రెవరేనిఁ గదపిన "నితఁడు తగఁడు
మనతోడఁ బోర"నం చనుకోక యవ్వాని నెదిరించి తమకున్న కదనశక్తి
గీ॥ అంతయో యింతయో యర్హులైన పండి!తులు పొనర్చెడి సభలోన నిలిపికొనఁగ
బూనుదురు పక్షపాతుల పూనికలను! వినరు తామెఱింగిన యట్టివిషయమె యిది

సీ॥ 'సత్యవాది' పదంబు చంతాలమయ్యె నద్దాని యాపద దీర్పఁ దలఁపుఁడయ్య
ఆడురాపదయె 'యథార్థవాది' పదంబు గనియెఁ దద్దుఃఖంబు కడపరయ్య

శాస్త్రీయమైనట్టి సరసాంధ్ర కవిత ధిక్కృతయయ్యె గెలుపోదు తెలుఁగుఁడయ్య
పదియాఱుకళల యవ్వానితో రిక్కల నైనఁజేయుపూనికల్ గోసకుఁడయ్య
గీ॥ కీర్తికాములరై కవితార్తిఁ బాపి, పక్షపాతులఁ బ్రావఁతల వలనఁ గలుగు
దేశఘోషంబు నుడిపి యుదీర్ణగరిమ। వఱలఁజేలువారుఁడయ్య ధీవరులు మెచ్చ
సీ॥ లేదు శాస్త్రజ్ఞత లేదు కావ్యజ్ఞత సంస్కృతజ్ఞానలేశమును లేద
శబ్దమంజరిఁ గూడఁ జదువంగ లేదయ్యె నదియట్టులుంచుఁ డింకాంధ్రమందు
లేదు వ్యాకరణంబు లేదు పాండిత్యంబు లేదు సార్వజ్ఞత లేదు శిష్యు
లకు భారతాదుల నొక పద్యమేని పాఠముఁ జెప్ప శక్తి నిక్కముగ నేరి
గీ॥ కట్టియయ్యలు మహాంధ్రమందు నెట్టి। మీసములు పీఁకుటకు నెట్లు మీసముల మ
హాత్ము లొప్పుదురోకొ తెలియంగవలయు, సభను సమహార్హుఁడయ్య యశస్వులార
సీ॥ తాఁ జెప్పినట్టి పద్యమునకే నర్థమ్ము చక్కఁగాఁ జెప్పఁ జాలుఁజూందు
తా నుచ్చరించు పదములకే నర్థంబు చక్కఁగాఁ జెప్పనఁ జాలుఁ జూందు
కవనం బనఁగ నేమొ కవు లున్న సభలోనఁ జక్కఁగాఁ జెప్పఁ జాలుఁజూందు
పద్యమ్ము లటులుంచి గద్యమేయనుకొందు చక్కఁగాఁ జెప్పనఁ జాలుఁజూందు
గీ॥ ఆంధ్రమంతయు వల్లెవేయ్యాంధ్రమైనఁ, జక్కఁగ నుపన్యసించినఁ జాలుఁ జూందు
మేము వదలెద మూరకే మీసముల మ। టంచు మీసముఁ దలపెట్టు టర్హమగునె.
సీ॥ మచ్చిష్యుల నటుంచి తచ్ఛిష్యులకుఁ గూడ శుశ్రూష జేసి నేర్చుకొనఁ దగిన
పాటిపాండితి లేనివారు మామీఁదికి వచ్చి కాఱులు వ్రాఁసి హెచ్చుతగ్గు
తెలుఁగక మీసాల నెత్తి పీఁకెద మన్న మాట కేమర్థంబు మాన్యులార
శాఖాభిమానపిశాచంబు వైదుష్య మీ నేర్చునయ్య యహీనులార
గీ॥ తగినమందులు పక్షపాతమ్మునకు ల। భించుఁ బక్షపాతముకు లభింపఁ బోదు
"కోఱిఁ బెట్టి నెత్తి నిగోఁకికొనియు, నిప్పు। డేటి రాజీలు మా వారికెఱుఁగఁ జెప్పుఁడి
సీ॥ ఆంధ్రమ్మునందేసి యష్టావధానంపు నామ మెత్తఁగ వీరి కేమిహక్కు?
శతవధాన మ్మనుశబ్దంబు నెత్తంగ వీరికే యారయ్య వేత్తలార?
[illegible]త్రావధానమ్ము నిగమజ్ఞులదికదా! దానిపే ర్వీరలెత్తఁ దగునయ్య?
నిజమైన శక్తియుండినఁ "బండితులుగల్గు సభ"యన్న యంతనే జాఱుటేటి
గీ॥ కయ్య! వారు సమ్మోదించు టాశుకవిత। యంత యుక్తమా మాత్రమేమైన [illegible]
విశ్వసింపక యున్న నా విశ్వమెల్ల। నమ్మలించుట కొంతేని సంభవించు.

సీ॥ "ఆశుకవిత్వమ్ము నందేని మీ కేల విశ్వసింప" రటంచు వేయఁ ప్రశ్న
కుత్తరమ్మాలింపుఁ డూరకే యొల్లెట్లో "బడబడ" వాఁగునప్పట్టునందు
నేరేనిఁ జాలుదు రేసూనవులా దాని మెచ్చిన నా మెచ్చు మెచ్చుగాదు
పండితులగువారు "పకపక"నవ్వుదు రవ్వారు నవ్విన నాశుకవిత
గీ॥ అందు వేరొక్క నామంబు నట్టిదాని, కెవ్వఁడీకొను "నిహిహిహీ! యిహిహి, యిహిహి యిహిహి, యనిపండితులు నవ్వునిట్టి పూన్కి గొనరు విద్వత్కవులు గనుంగొనుఁడు మఱియు

సీ॥ కట్టుఁబాటులు గల్గు గానంబె గానమో? కట్టువీడినదియే గానమొక్కో?
కట్టుఁబాటులు గల్గు కాంతయే కాంతయో? కట్టుదప్పినదియే కాంతయొక్కో?
కట్టుఁబాటులు గల్గు కాయమే కాయమో? కట్టు వాసినదియే కాయమొక్కో?
కట్టుఁబాటులు గల్గు కవనమే కవనమో? కట్టూడ్చుకొన్నదే కవనమొక్కో?
గీ॥ మీమన మెఱుంగదే? మేరమీఱి మంచి, చెడ్డ లరయక యెన్నారో చెట్టలఱచు
వారి నేరంబు సైఁచుట పాడిగాదు, మూక లిడుఁడయ్య సత్కీర్తి గోరుఁడయ్య.

సీ॥ సంస్కృతగ్రంథవాసనయె లేకున్నచోఁ దెలుఁగుగాదది పెద్దతెగులుగాని
ఆంధ్రరహస్యవైయాత్యమే లేనిచోఁ దెలుఁగుగాదది యొక్కయెలుఁగుగాని
శబ్దశాస్త్రప్రవేశము సుంత లేనిచోఁ దెలుఁగుగాదది మేనినలుఁగుగాని
నాటకాలంకారనైపుణుల్ లేనిచోఁ దెలుఁగుగాదది చెడ్డపలుగు గాని
తే॥ గీ॥ ఈరహస్యంబు నెఱుఁగని వారెమీరు, తెల్గులో నేని వీర లెదిర్చి యేమి
నేతు రనుకొంటిరో? సుంత చెప్పుఁడయ్య, సంధిసంగతి కేమి యోసరసులార.

సీ॥ ఏపండితుఁడు వచ్చి యివ్వారితో మమ్ముఁ దులఁదూఁచి తనకీర్తి నిలిపికొనెను?
ఏకవీంద్రుఁడు వచ్చి యివ్వారితో మమ్ము సరిఁజేసి సద్యశశ్శాలి యాగును?
ఏజమీందారు వచ్చి యివ్వారితో మమ్ము నెనఁజేసి తా వన్నెకెక్కఁగలఁడొ?
ఏదైవతము వచ్చి యివ్వారితో మమ్ముఁ బురుడించి దీప్తినిల్పుకొనఁగలఁడొ?
గీ॥ చూచియే తీరుదుము మీఁదఁ జూడవచ్చు, సంధిసంగతు; లెల్లైని సభయొనర్పఁ గడఁగుఁడయ్య! వేఱొక గతిగాంచఁబోకుఁడయ్య? వేత్తలఁ రప్పింపుఁడయ్య! యయ్య

సీ॥ చెప్పింపుఁడయ్య! దేశమునొక్కరు నిల్చి చదువనందెలు మనశక్తి కింక
చేయింపుఁడయ్య! యీ ప్రాయమందున నె శుశ్రూష కావ్యజ్ఞు నిచ్చోట నిల్పి
మాన్పింపుఁడయ్య! "డమాడమాడముడమల్" "ప్రాజ్ఞా లీపోకలాప్ప" రని చెప్పి
బోధింపుఁడయ్య "యీబుడబుడక్కల" కాశుకవితాప్రశస్తి దక్క' దని నొకిట

గీ॥ మీకు యశమబ్బు వారికి మేలుగల్గు, మమ్మెదిర్చినపనికి లాభమ్మె వెంట
నేకనంబడు మాకెంతయేనిమోద, మబ్బు నంధియు నామీఁద ననుఘటించు.

సీ॥ వైదికలౌకిక వైషమ్య మెవ్వారు తెచ్చిపెట్టిరొ? సుంత తెలియుఁడయ్య
ఆత్మగౌరవమునకై పాటుపడువారె దీనిఁబెట్టుదురు సందేహ మేల
తనుగౌరవంబు విద్వత్త్వమందునుగాని యన్యమ్మునకు నుండ దనుట ధ్రువము
గానఁ "దదన్య లీకక్షకుఁ గారకు" లని యెవ్వరేనియు ననకమాన

గీ॥ రకట? విప్రులు, దేవాంగులట్లు వశ్య, తో హరులయట్లు వెలివెట్టి త్రోవఁబోవఁ
గావలెనె? దీని మాన్పఁగఁ డఁగుఁడయ్య, సంధి గోరుమీ కియ్యది చనుఁగదయ్య.

సీ॥ ఆంధ్రభారతకర్త యైనతిక్కనసోమయాజిజన్మస్థానమైనకతన
శ్రీనాథకవిరాజశేఖరు నేలినకొండవీటికిఁ బ్రక్కనుండుకతన
ప్రకృతంపుఁగవుల సంభావించుగద్వాల రాజ్యంపుఁ ద్రోవలోఁ గ్రాలుకతన
వెనుకకాలమునందు వినుతింపఁ దగుపెద్ద విద్వత్కవులు దీన వెలయుకతన

గీ॥ నింతకవితాదరంబు మీ కిచ్చె మెచ్చ, వలదె గుంటూరిపురిని విద్వత్కవీంద్ర
జనని, కేవలకవితరసస్ఫురిణి, దీని, మహిమ మెంతేని శ్లాఘ్యంబు మాన్యులార.

సీ॥ నిందింపనేమయ్యె? నిజమైన సత్కీర్తి గణియించు "సత్యవాదులు" గలారు
గర్హింపనేమయ్యె? గణుతి నర్పించుయోగ్యు లగుయథార్థ వాదులు గలారు
కయ్యాలకేమి? సత్కవికదంబముల పేర్వెలయింపఁగలనియోగులు గలారు
అభిమానమునకేమి? యాత్మీయుకతన శత్రులఁగూడ మన్పు మాన్యులు గలారు

గీ॥ పరిచే మెచ్చుగొనదు గుంటూరిపురము, సగసతకుఁదాఁకు బలువన్నెసిరుల ప్రోవు
మాకుమీప్రోలికిని మేరమీఱుసిరుల, నిచ్చు భగవంతుఁ డింక మమ్మెగ నిండు.

సీ॥ ప్రేమించితిమి మున్నె పెద్దఱికము నిల్పుకొన్నచో వారి కేకొఱఁత రాదు
వారినేమముఁగోరువారె "యాదవకుల మునకు ముసలము" నానసపుఁ జర్చ
కల్పించి రదిపూర్వకవిసమ్మతము గామి మాకు నంగీకృతి లేక పోయె
దీని నామీఁద వైదికనియోగపుఁగక్షగాఁ బొల్చె రెవ్వరో ఘనులు వారి

గీ॥ నెఱుఁగుఁడయ్య! 'యనవసరమిట్టికక్ష, లింపుగాఁబో' వనుచు మందలింపుఁడయ్య
యేరు వైదికులు? నియోగులెవ్వ? రొకటె, విప్రులే గారటయ్య! యోవేత్తలార.

సీ॥ ఘనుఁడు పరోపకృద్ధఖండపాండిత్యభూషణుఁడు సీతారామశాస్త్రి కన్న
నుభయభాషాకవితోద్వహాయశాలి శిష్టహనూమచ్ఛాస్త్రికన్న
కృతి యభినవసరస్వతి నేత పట్టాభిశబ్దపూర్వక రామశాస్త్రికన్న
ములుకుట్లకులుఁడు నిస్తులుఁ డాశుకవి గుణశాలి వెంకటకృష్ణశాస్త్రికన్న
గీ॥ మఱియు నుంగలశాస్త్రవిద్వన్మణులకన్న, మొలచిన వెకొమ్ము లితరుల మోములందు?
నవసరము లేనియాసనం బడుగ నేల?, చర్చ పెంచఁగ నేల? యశస్స్వలార.
సీ॥ వేదవేదాంగాదివేత్త చేవలి వెంకటప్పశాస్త్రుల కెన యన్యుఁ డగునె?
రామడుగుకులుండు ధీమన్మణియు రామకృష్ణశాస్త్రులఁ బోలనేవని వశము?
కంఠపాఠము నాటకము లెల్ల శ్రీనోరి హనుమచ్ఛుధుని కెవ్వఁ డగును దీటు?
అతిశాంతమూర్తి సాహితిపట్టు శ్రీపార్వతీశశాస్త్రికి సాటి యెందుఁ గలఁడె?
గీ॥ మఱియు నెందఱులేరు ధీమంతులందు, వీరిలో నేరు కొఱవింపువారు చెపుఁడ?
వారికేయాసనంబును గోరనేల, చర్చ పెంచఁగ నేల యశస్స్వలార!.

సీ॥ కవి పూరాణభాషావగాహి వంకిపురవంశజుఁడు శ్రీకృష్ణమాచార్యకన్న
బలిజేపల్లి కులసంభవుఁడు కవిత్వవిస్ఫూర్తి లక్ష్మీకాంత సుకవికన్న
సకలకళానైపుణికిఁ దావు మేటి మల్లాది వెంకటసోమయాజికన్న
నాలువేలనియోగి యనఘ జూపూడివంశజ హనూమచ్ఛర్మశాస్త్రికన్న
తే॥ గీ॥ మఱియు నుంగల సత్కవిమణులకన్న, లౌకికాగ్రణులకన్నను లాఁతివారి
కాసనము గోరనేలయ్య! యనుచితముగఁ, జర్చ పెంచఁగ నేలయ్య సరసులార?
సీ॥ శాంతి భద్రాద్రిశాస్త్రులవారిశిష్యుండు తచ్ఛైలి గలకైత దనరు సుకృతి
"అవధాన మేఁ గూడ నాచరించితి" నని స్వయముగాఁ జెప్పికోఁజాలు ధట్టుఁ
డొకశైలి నేకాక ప్రకటితంబుగఁ బలుశైలులఁ గవనమ్ము సలుపు జాణ
ఎపుడు రచించినక్లైటె కనుపట్టకే పలుకృతుల్ ప్రకటింపఁ గలయుపాయ
గీ॥ శాలి బ్రాహ్మణప్రభుపు నాచారపరుఁడు, ప్రథితమంత్రిప్రగడవంశభవుఁడు శ్రీభు
జంగరాయల కేల యాసనము వడుగ?, రారులు వీరికి మిన్న లేరె యోగ్యులార?

ఉ॥ పటుజంఝానిల ఘోరణీరణరణత్ప్రాగ్భారసన్నాటవీ
తటశాఖాపటలాంతరుద్గతనితాంతస్ఫారఘోరాగ్నిరు
ద్ధటనాభూపితభస్మసాత్కృతకురుద్బ్రహ్మాండంబుతో వహ్నికిన్,
ఘుటియుంపం దలపెట్టినారు కద! సభ్యం భార్యచూడామణుల్.

మ॥ స్వకృతాగఃప్రకర ప్రచారనిహతాపారస్వరాష్ట్ర ప్రజా
నికరార్త్యైకశరణ్యసర్వధరణీ నిర్ణేతృతాభాగ్యభా
రకృతాహంకృతితో సుయోధనునితో భ్రాజిష్ణునిన్ ధర్మపు
త్త్రకునిన్ గల్పఁదలంచినారె? యిది ధర్మ్యంబె ట్టు లోహో! హితుల్.

సీ॥ "గర్వం"బనెడి మిష గల్పించి దుఃఖంబు దీర్చుకో సుంకించు ధీరుఁ డొకఁడు
"పండిత లక్షణ" ప్రస్తావమిషచేతఁ బడదిట్టునట్టి సర్వజ్ఞుఁ డొకఁడు
"వంటబాపనికుత్సవం"బంచుఁగల్పించి రసఁ బేరుగనుయశో రాముఁ డొకఁడు
"రామేశ్వరీయ"మన్నామంపు పొత్తాన బూతు లేకరు వెట్టుపుణ్యుఁ డొకఁడు
తే॥ గీ॥ మఱియు నెందఱొ శాఖాభిమాను లిట్లు, బయలు దేఱిరి యింక నుబయలు దేఱఁ
గలరు కీరితి చేకూర్పఁ గలరు సంధి, కొప్పరపు వారికేటికిఁ జెప్పఁడయ్య.

సీ॥ "ఈలకూరకుఁ బోయి యిల్లటం బున్నట్టు"లయ్యె మావర్తనం బార్యులార!
అలపాశుపతమహాస్త్రాగ్ని హోత్రజ్వాల లాఁగిపోయెను దీన ననఘులార!
కాఁకరపర్తి "శృగంపుభంగపు" వ్రాఁత లడఁచుపూనిక దీన నడుగుఁబట్టె
చర్ల నారాయణశాస్త్రి "బార్హస్పత్య" మరయువేడుక దీన నంతరించె
గీ॥ గీరతము సారెకుం గోరు గీరతులకు, తూహాలమ్మునకించుక దొడరె విఘ్న
మికఁ గృతమ్మన, నిఁక నింటికేగ నాజ్ఞ, యొసఁగుఁడయ్య గుంటూర్పురీయోగ్యులార.

సీ॥ కొప్పరంపువారు మాకుఁ గనిష్ఠు లవ్వారి కరయఁగా జ్యేష్ఠుల మగుదు మేము
కొప్పరంపువారు మాకు సుశిష్యు లవ్వారి కరయఁగా నొజ్జల మగుదు మేము
తత్కవిత్వంబు "సదరు మరాటా రైలు" "మదరాసు రై"లయ్య మాదు కైత
మిత్రుల నవ్వారు మెప్పింతు రేము శత్రులఁగూడ మెప్పింపఁగల మొకింత
గీ॥ వయసు కా! పెద్దలము మేము, వారుపిన్న, లింతియే భేద మింతకునింత కలహ,
మెందులకు? స్నేహితులమైతి, మింక మీరు, శంక దక్కుండు సెలవు నొసఁగుఁడు మాకు



క॥ ఉరుకీర్తి నరసరాట్పుర, 'వరవాసుఁడు పంగనామవంశ్యుఁడు సుగుణో
ద్ధురుఁడు నరసింగరావ, ప్పరమునకున్ మమ్మును స్వయముగఁ దాఁబిలిచెన్

తే॥గీ॥ అతఁడుశాఖాభిమానుల, కహితమైన, పనికిఁ బూనినకతన నప్పట్టణంపు
శాఖలోని గుణాఢ్యులు సాగకుండఁ, జేయవలె నని యత్నంబు చేసి రంబ,

ఉ॥ *ఆపురికేమురేపు చనునట్టికుతూహల మూనియుండ నే
పాపియొకాని యయ్యన ఘనజ్జకుఁ బోయి "వృథాప్రయత్న మే
లా పొనరింతు? విప్పరికి నల్లకవుల్ చనుదేరు భీతిలో
దాపర మయ్యె వారి" కని తా నొగి బొంకె కలంచె నాతనిన్. ౨౦౦

చ॥ కలఁడు ప్రసిద్ధ వంశ్యుఁ డరికాండము సైతము మెచ్చఁ దగ్గధీ
బలమున కిక్క యా "పయిడిపాటి" నివాసి, యశస్వి త్యాగి వి
ద్యలకు నిధాన మంబ? కవితా వనితా హృదయంగముండు పే
ర్వెలసిన "రామరా" వనెడి వెల్లముకొండకుఁ జీనుఁ డున్నతిన్. ౨౦౧

---

*(నర్సరావుపేట శతావధానపీఠికనుండి.)

...నర్సరావుపేట.

ది 30-9-11

నా ప్రియమైన ఆర్. హనుమయ్య గారికి— శ్రీ "తిరుపతి వెంకటేశ్వరకవీంద్రుల"నిక్కడకు దయచేసి వారి కవితానై పుణ్యమును జూపనిక్కడకు రమ్మని యాహ్వానఁ జేసియుండుట మీకు తెలిసినవిషయమే కదా; వారిని ఆవాహనచేయుటకు తగుప్రయత్నములన్నియు సిద్ధపర్చుకొని యున్నాము. నోటీసులు పంచిపెట్టి సొమ్ముపసూలుచేసి పెండాలువగైరా సిద్ధముచేసి యున్నాము. వారురేపిక్కడకు వత్తురని నిరీక్షిస్తూయున్నాము. అవధానము రేపు 1 గంటలగాయితు ఆరంభమగునని నోటీసులలో ప్రచురించినాము. ఇక్కడ శతావధానమే లేదనియు, యిది యంతయు నబద్ధమనియు, పి. నరసింగరావు సదరుకవులను మోసగించదలచినట్లున్నూ, ఎవరో వారితో చెప్పియున్నట్లు,వినుట మిక్కిలి విచారకరముగా నున్నది, అట్టిమాటమేమెన్నడు తలంచ లేదనియు, యీశతావధానము కైపూనినవారందఱు మరియానగల పెద్దమనుష్యులనియు, మేము రూఢిగా చెప్పచున్నాము. అవధానమిచ్చట జరుగుట యిష్టములేనివారలు పన్నినకుట్రమాటలై యుండునని మేముతలంచెదము. ఈవిషయమై మేమింక వ్రాయవలసినయవసరముండదు. సదరు విద్వత్కవుల మనస్సునగల సంకోచము మీరు నివర్తించకోరుతాము; రేపుప్రదయం 9 గంటల రైలుమీద వారు యిక్కడికి దయచేయవలయును. ఈయుత్తరంతెచ్చినవారు ప్రత్యేకించి వారినిక్కడకు తీసికొనివచ్చునిమిత్తం

చ॥ అతనికి మాయెడన్ మఱియు నాయనయందున మాకు వినిర్మలమై
నతితరమైన పేర్మి యలరారెడి నప్పురిలో వధానమున్
గుతుకముమై నొనర్చి కనుఁగొంద మటంచుఁ దలంచుచుంటి మ
ట్టితఱిని బెట్టై నొకట్రఁడు కడింది గఁ గయ్యము దయ్యముం బలెన్. ౨౦౨

---

పంపబడిరి. రేపు వారు ఇచ్చటికి రానియెడల మాకవమానకరముగా నుండును, దయయుంచి వారు రేపు బయలుదేరులాగు చేయకోర్తాము. ప్రస్తుతము గుంటూరులో యితరులు "శతావధానము" చేయుచున్నను, వీరిప్రఖ్యాతి యిదివరకే లోకములో పాదుకొనియున్నది. కాబట్టి దానిని లక్ష్యము చేయక తప్పకరా గోరదము.

ఇట్లువిధేయులు
ఆర్. కృష్ణమూర్తి.
పి. నరసింగరావు.

పరా—(ఇంగ్లీషు వుత్తరమునకు సరియైన తెనుఁగు.)

---

చంపకమాలిక॥ "భయపడినారు రా" రనుచుఁ బలికిన వాఁడఁట? యెవ్వఁడో
మహాశయుఁడు భవత్సమీపమున; నంకనునట్టిది మాకుఁ జెప్పదు,ర్జయుని క్షమిం
చు తావక ఘనత్వము శ్లాఘ్యము "సత్యవాది" దు,ర్జయము, "యథార్థవాది" యపరాధ
ము,నింతకుమున్ను పత్రికల్,న్యాయముగ వెల్లడింపఁగని వారలవారణ పొల్లటంచు
న్నా,హా యెదియుఁ దోఁప కేవగచున న్మదఖండరుషాగ్ని కీలకీ,వ్యయింత దురూహదుర్జయ
ములాజ్యము గావుటకించుకేని సం,దియమును గల్గునే! యకట! తిర్పతి వెంకటశాస్త్రు
లెందుకో? భయపడుటల్; రిపుల్ మనుపై పాఱిరి దూఱిరితోఁచినంతయున్,నయ
మొకయింత నేరనియనాథలు వాఁగుట తప్పనన్యమే,దియు భయకారణం బరగుదేర
దు వారలనోరుమూయ మీ,కెయనఁగ నేల! రుద్రినకు నేని యశక్యమా? దేవుఁడెందు
ని, శ్చయముగ లేఁడ"టంచ నెడి సాహసులన్ భగంతుఁ డేని యే,మియు నొనరింప
నేర్చునె! యమేయున కేనియ సత్యవాది దు,ర్జయుఁడె న్న్యాయంకృతమ్ముల నపరాధము లే
తుదిరూపుమాపుచో,గయకరుగన్ వలెన్ దురితకారకులొ మొఱకుల్;తదీయని,ర్దయత
రవర్తనంబడఁ పరా దదివృద్ధికి వచ్చు పేనుఁడీ, యయామొనఁగూర్చు సజ్జనులు; కద్ది

చ॥ కలహము పెట్టుమానినియు గర్వకుమాటెడివాఁడు గాఁడు పై
నెలమినీ వాని నూఁత గొని యెన్నియొ ముగ్గులు పెట్టుచెట్టు నీ
డలమురిపంపుజీవనపుఁడక్కరు లాతనిపాటి వారె య
య్యలఘుఁడు రామరా వొకఁడె యాఢ్యుఁడు సర్వవిధాల నంబికా. ౨౦౩

---

శా! పైకినమస్కృతుల్ మృషా,ప్రియములుపలుకుచుఁ గొసలుపుఁబేరును మాటిచిమా ఆ నేర్పు సం,ఘయశముకోసమై మిగులఁగష్టమొనర్చెద,నంచువాఁగు ని,ర్ణయమున మస్తముం దెలిసి నాస్తికుఁడై యనృతమ్ము లాడు గో,మయజలసేచనార్హుఁడగు మానవుఁ; డాయవివేకితోడ నా,భయరహితాత్ముతోడ నలపాతకపుంజముతోడ నట్టిసం,శయలవశూన్యతోడ నలసాహసికాగ్రణితోడ నట్టిమృ,ణ్మయయశుతోడ నట్టిపితృమాతృవిరుద్ధునితోడ నట్టియా,మయముఖుతోడ నట్టిఖలమాన్యునితో నటువంటిజెట్టతో, నిఘాతదురాశుతో జితమనీషివరేణ్యునితో నపాత్రుతో, నియమితలజ్జుతోనెవఁడు నేర్పుఁ బెనంగఁగ;మిమ్మువంటివా,రియశము నందె యెట్టులో పరిశ్రమచేసికళంకు నింప ని,ర్దయుఁ డాయతించెఁగా! అపుర! దంభ,మహోయవివేక!హార!దుర్ణయ,మధురాకుతంత్రి!మపురా!కలికాలము! పతి)కామహా,శయులను బోలె మిమ్ముఁదన సంచినినిందఁదలంచెఁగాదురా,మయుఁడు; మయుండుపన్ననలమాయలు పన్నెడీవిని సాహసో,దయమిటు లేప్రవృద్ధిఁగనితద్దయు వానికిఁ జేటు దెచ్చుఁగా,కయతనితోడనేమి! కలకంఠుఁ డెదుర్పఁగ వచ్చె నేనియున్ "భయ,,మనువాట మాగృహమువజ్జవసించెడికుక్కకేని లే, దయమొనఁ గూర్పు కాళికజయింబెపుడున్ సమహార్పితీరుదు,ర్ణయులు హతాశులై చెడి యనాథవివాహపుమంగళధ్వని, ప్రియముఖులై యడంగుదు, రుపేక్షయొనర్చు క్షేమేలు వీరికై,నీయుఁక మటెంత కాలము నశింతక నిల్పునో? చూత మోమహో,దయ! నరసింగరాయ! మమతన్ మముఁ బిల్చిన మిత్రుని న్నునె,మ్మెయిఁ గికురింతు! మెవ్వఁడో యమేధసుఁడే మన నేమి యా దురా, శయులు నశింతు గాక విలసద్యశమబ్బెడుఁ గాక నీకుమా,కయిశ్రమచేసినందులకు నంబిక నీకు శుభమ్ము గూర్చి మా, జయమున కొక్క కంబముగఁ జక్కఁగ నిల్పెడుఁ గాక యిప్పరిన్, సీ॥ స్నేహితుల్ పిలిపించి చేయించుసభకంటె శాత్రవసభయే యశఃప్రదంబు, జయము గోరెడి సభాసదులకంటెను బరాజయము గోరెడిసభాసదులె హితులు, నీరసప్రశ్నముల్ గోరువారలకన్నఁ గఠినసంప్రశ్నకుల్ కరము హితులు, స

క॥ అతఁ డింట నుండియే వం, డితులం బిలిపించి విద్య నేర్చెన్ శాస్త్ర
స్మృతిముఖ్యసంస్కృతకళా, గతి ససదృశుఁ డంతెకాదు కవితాన్వితుఁడున్
తే॥గీ॥ నరసరావుపురి శతధానంబుఁ మొదట, జరిగె నందునొకానొక జనుఁడు రామ-
రావు నడిగి సమస్యవైరంబుకతనఁ, దెచ్చి మాకిచ్చె నదిమాకు సద్పదయ్యె ౨౦౫

---

# నరసరావుపేటశతావధానము.

ఉ॥ మాకొఱ కొక్కబ్రహ్మను సమస్తకళాకరు సృష్టి చేసి యా
వ్యాకరణామృతాంబుధికి వారిదముల్ పొనరించి మమ్ము; మా
స్వీకృతశిష్యులన్ సదులఁ జేసి యశం బనిశంబు నించి లో
లాకలనంబునన్ సరసులన్ దనియించుపరాంబ నెంచెదన్.

ఉ॥ రెండవసారి యర్జునుఁ డరిందమయాత్రకు నేగుపట్టునన్
ఖండనమందు గాండివము పార్థునిహస్తమునుండి జాఱిన
ట్లొండొకచో స్ఖలద్గతియు నుండిన గెలి యొసర్పకుండ మా
చండిక వచ్చి వెంబడినె సర్వము నిర్వహణం బొనర్చెడున్. వెం॥ శా॥

ఉ॥ "ఎందులకై జనించితిరొ యేపనికై మఱి పూనియుంటిరో
అందులకై శ్రమంపడక యందును నిందుఁ జరించు టేల" యం
చుం దరిలేనినీదయను జూపఁగ నెంచితి వోమదంబ! యీ
చందముగా వధానములు సాఁగఁగ నిమ్మటు లేని యీశ్వరీ. తి॥ శా॥

సభ్యులిచ్చినకల్పన.

సీ॥ చుట్టుపట్టుల నెందుఁ జూపట్టదే సింగ మని మనంబున ధైర్యమును వహించి
జంబుకమ్మొకండు జంకింతయును లేక గర్జించె నఁట! "సింహగర్జిత"మని
ఆసమీపస్థకుంజాంతరమ్మున నిద్రఁ గనుచున్న యొక్క సింగమ్ము కన్ను
లర విచ్చిచూచినయంతనే యానక్క వీఁకఁ యంతయుఁ జెడి తోఁక ముడిచి.

---

మ్మను మొనరించు సజ్జనావళికంటెఁ బడఁదిట్టువారెయాప్తవ్రజంబు తే॥ గీ॥ యాక
నుచు నెంచు లోకసమ్మతు లెకాని, "శత్రుసభ" యంచు మదిలోన జంకిపోవు,
వంచకశతావధానులపంచలోని, వారు తిరుపతివెంకటేశ్వరులు గారు. (తి॥వెం॥)

తే॥ గీ॥ పాటిపోయియు "సింగమే పాటిపోయె,నంచు నవలంగ(జూచ్చె యథార్థవాది
సత్యవాదియునౌచు నిచ్చలును గడంగి, యిట్లైగా! శక్తిహీనులయెమ్మెలకట.౪

సత్కావిత్వము

శా॥ సారాసారవివేకముల్ గలిగి శాస్త్రప్రక్రియాధుర్యమై
పేరుంగాంచిన సత్ప్రబంధవితతిన్ విన్నాణమౌ నయ్యలం
కారాదుల్ గనుపట్టమోద మిదు,సత్కవ్యగ్రిణుల్ మెత్తు, రే
దోరీతిన్ జెడుగుళ్ల గాయ నది వింతల్ నేయునే యేరికిన్. ౫

వృచ్ఛకుడిచ్చినకల్పన—కవిరాజవిరాజితము.

తిరుమలలో నలదేవుని భక్తులు తేకువమై నెటు పూజలచేఁ
బరమమహోత్సవముల్ పొనరించుచు భక్తిమెయి న్నుతియింతు రటుల్
తిరుపతివెంకటనామముల మమ్ములఁ దిరికమైఁ బిలిపించి మహా
దరమున నూరున నేగఁగఁ జేసిరి తద్దయుఁ బౌరులు నర్సపురిన్. ౨౬

చిల్లపెంకు.

సీ॥ ఎద్దిదా నీటిలో నెగురవైచినయంతఁ గప్పగంతులు వైచి గుప్పచుండు
నెద్దిదా వీధిలో నేగుచోఁ గాలిలో వలఁ గ్రుచ్చుకొని బాధపడఁగఁ జేయు
నెద్దానిఁ ద్రొక్కుచో నెగిరి తిట్టుచు ముసలమ్మలు మడినీళ్లు గ్రుమ్మరింతు
రెద్దానిబాలురెంతేఁ ద్రొక్కుడుంబిళ్ళయాటలో నుపయోగమనుచుఁగొంద్రు
తే॥ గీ॥ అట్టిచిల్లపెంకుదరినిబుట్టి బీఅ, పాదు చేఁదుబీఅను పేరఁ బరఁగుచుండు
దానివర్ణించుచును గవితనురచించు, వారికవనంబు చేఁదుగావఅలు నేమొ.౨౧

దశావతారములు-

క॥ జలచరకూర్మవరాహా,మలనరసింహావటురామమానవరామో
జ్జ్వలబుద్ధకలికిమూర్తిన్, దలఁచెద నే నాదశావతారున్ధీరున్, ౨౪

రాజు— కవిరాజు.

ఉ॥ ఆతఁడునకర్సార్థి, యితఁ డన్నను నక్షైరసార్థి, శ్లోకనం
పాతమనోహరుండతఁడు, పస్తుతవృత్తమనోహరుండు వి
ఖ్యాతుఁ డితండు నట్టిఁడ తగన్బరిశీలనచేయ నిర్ధుతా
రాతినృపాలుఁడున్ సుకవిరాట్టు సరానరిపారలేకదా. ౨౬

ఇప్పటికొండవీటిసీమవైఖరి.

శా॥ జొన్నన్నంబులు పోయె నెల్లరకు హెచ్చుల్ గొల్పుపేల్ రాజనా
లన్నంబు ల్లభియించె మున్నుయగుగోఁగా కన్నఁ గర్వమ్యై సం
పన్నంబై తగుబాణపాలనము సంప్రాప్తించు నీకాలము
దిన్నా! జాజ్జినృపాల! నీకృప నెంతైశ్వర్య మింకబ్బునో. ౨౭

శార్దూలమార్జాలములను గూర్చి.

శా॥ చాఅల్, కన్నులుఁ, గూడుచుండుగ లి, మార్జాలమ్ము త్రగా సుప్ప రఘం
కారంబుల్ గనుకొన్న మేనిపటిమల్ గన్గొన్న భేదించు బల్
ఘోరాకారము గల్గువ్యాఘ్రములు వైకొన్నట్టిశౌర్యంబు మా
ర్జారంబుల్ పొసరింప నేర్చు నెటు లోడల్ జచ్చి జన్మించినన్. ౩౬

(అవధానాంతమున, ఇతరులుచెప్పిన పద్యములనుండికొన్ని.)

సీ॥ ఆశుకవిత్వంబు నల్లుట జగతికిఁ జవిఁ జూపినట్టియా నరసమటులు
అవధానసంపద నతిలాఘవముఁజూపి కీర్తిఁ గాంచినయట్టికీర్తియుతులు
సంస్కృతాంధ్రములందు సరిలేనిపాండిత్యగరిమ గాంచినయట్టి గణ్యయశులు
ఎలమిరాజులచేత నెంతేనిమర్యాద లందియు, నందుచున్నట్టిఘనులు

తే॥ గీ॥ నాచు నీయవధానమింపలరఁ జేసి, మమ్ముఁ గృపఁగి నిండుప్రేమంబుతోడ
సుకవిశేఖరు లంచను సూరిజనుల. పలుక నిజమయ్యె సీప్రిజ్ఞ పరిఢవిల్ల.

ఇట్లు, భువనగిరిబుచ్చిపరదేశి సోమయాజులు.

క॥ అరయంగ నరసరాట్పూర, వరమున విబుధేంద్రులెల్ల బళిరేయనఁగాఁ
దిరుపతివేంకటసుకవులు, మురిపమున శతావధానమును సల్పిరొగిజ .

గడియారం వెంకటకృష్ణుఁడు.

చ॥ ఇపుడుసజీవులైన మనయెల్లరపట్ల శతావధానపుల్
సుపథము మాడభూషికులసోముఁడు చూపెను వెంకటార్యుఁడీ
విపులను దత్ప్రతిష్ఠితనవీనపుసీయ ధానమార్గమున్
విపులము చేసి కైకొనిరి విశ్రుతి తిర్పతివేంకటేశ్వరుల్.

ఉ॥ ఇట్టిపథంబు చూపుటనె యెందఱో యష్టవధానులౌట కాఁ
బట్టి వధాని యైనప్రతివానికిఁ గూడ ననన్యభక్తిమై

మొట్టమొదల్ తదీయపదముల్ భజియించుటయొక్క లేనిచో
దిట్టఁడె యాతఁడైన గురుధిక్కృతిఁ జేసినవాఁ డనంబడున్,

జానపాటి పట్టాభిరామశాస్త్రి,
అభినవసరస్వతీ పత్రికాధిపతి.

సీ॥ "చంద్రుఁ డెవ్వనికైనఁ జల్లగా నుండఁడా? పద్మాలభాగ్య మాపాటిగాక"
వెలుఁగేరికైనను వెలుఁగుగా నుండదా? గుడ్లగూబలనూను కొఱఁతెగాక
కలకండ తీయనై వలపుఁ బుట్టింపదా? పైత్యరోగుల పాపఫలముగాక
కోయిల గానంబు సొంపుగా నుండదా? విరహుల దుర్దశావిధముగాక
తే॥గీ॥ మీకవిత్వంబు మీలీల మీదుఫణితి, నరసులకుఁ గాదె కర్ణరసాయనంబు
సరసతిరుపతి వేంకటేశ్వరకవీంద్రు, లార! శాశ్వతకీర్తి విస్తారులార.

ఉ॥ కూరిచినారు మంజులసఘూర్ణితదివ్యకవిత్వతత్త్వ మొ
ప్పార ననేక కావ్యముల నందిరి ప్రాజ్ఞులు మోదమంది మీ
పేరులు సర్వదేశముల విశ్రుతముల్ వివరింప నేల? మీ
ధారణకు స్వమనస్కృతిశతంబులు తిర్పతివేంకటేశ్వరుల్

ఇట్లు,
రామప్రోలు సుబ్బారావు.

సీ॥ ఎవ్వారి శుభనామ మేప్రొద్దు నుడువంగ! పాపచయంబులు పాఱిపోవు
ఎవ్వారి మిత్రత్వ మెల్లభంగుల మాకు సుఖమును వృద్ధియు సొరిదిఁ జేయు
ఎవ్వారి కావ్యంబు లేవేళఁ జదువంగ సంశ్లేష మిడుచుండు ననఘఫణితి
ఎవ్వారి దర్శన మేపట్ల నబ్బిన శారదఁ గాంచిన తీరు మీఱు
తే॥ అట్టిజగదేక కవిసింహు లనఘపదులు, సరసముగ నవధానముల్ సలుపఁ బూని
పూర్తిగావించి మించిరీ పురములోన, వారి వర్ణింపఁ దరమె యెవ్వారికైన

స్వయంపాకుల సీతారామమూర్తి,
బ్రహ్మశ్రీ శిష్టాహనుమచ్ఛాస్త్రి గారి శిష్యుఁడు

చ॥ వరసుపవిత్రతన్ మిగుల భవ్యతరంబగు గౌతమీతటిన్
జరలకు లాభిచంద్రుఁడును సత్పథవర్తి ప్రశాంతచిత్తుఁడై

వరధవళేశ్వరంబున నివాసముఁ జేసిన బ్రహ్మశాస్త్రి భూ
సురవరుసుద్ధ శాస్త్రములు సుస్థిర తన్బరియించి వారిస
త్తరమున సన్నముం దినుచుఁ దత్సుతవర్గము బోలిఁ నిచ్చలున్
సరసకవిత్వమార్గములు సభ్యులు మే లన నేర్చి వారి యు
త్తరుణసుబొంది సద్గురుని దద్దయు భక్తి నుతించి వేగ మే
తిరుపతివెంకటేశ్వరను ధీమణు లిర్వురు ప్రాజ్ఞులై భువిన్
దిరిగిరి సర్వదేశములు దేజమెలర్పఁ గవిత్వకన్యకా
వరులయి రాజ్యపూజ్యులయి వందలు వేలు ననంగరాని సం
దరపతకాదిభూషల సుదారధనంబులఁ గొంచు నర్సరా
ట్పురమున కేగుదెంచిరి సుపూజ్యత నీయఁ దలంచు మంజనా
వరతనయా! యటంచు నభివాదన మే నొనరింతు మారుతిన్

బూరుగుపల్లి లక్ష్మీనరసింహాచార్యులు.

మ॥ వితతాత్మీయశతావధానకవితా విద్యాపయోరాశి సం
భృతశిష్యాంబుదవాఙ్మయామృతరస ప్రీతాఖిలాంధ్రక్షమా
వృతరజ్యద్రసికావతంసకృతవందిస్తోత్రమాలావిభూ
షితు వేంకటశాస్త్రి నేఁ బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్.

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.

☞ అవధానపద్యములేమి, అయ్యవధానాంతమున నితరులు చెప్పిన పద్యములేమి కడుస్వల్పముగా మాత్రమే యుదాహరించితిమి, ఇందు దివాకర్ల తిరుపతిశాస్త్రి, అనుచేవ్రాలుగల పద్యము, అష్టావధానాంతమున, వెం॥ శాస్త్రినిగూర్చి చెప్పినది. ఆయష్టావధానపద్యములను, అచ్చయియున్న నరసారావుపేట శతావధానమందే చూడఁగోరెదము. దాని వెల రు. 0-3-0 లు మాత్రమే.



క॥ అందుఁగల "పశ్య" శబ్దము, సందేహాస్పదమౌ కాక సరసతరంబుగా
డెందమునకుఁ దగులదు తత్సందర్భముకతన దుష్కృతకుఁ డావనుటన్. ౨౦౬
సీ॥ పృచ్ఛకుఁడు మూర్ఖుగాన స్పష్టమయ్యెను గాక, పైకిపో వేగి మాలవాఁడు వచ్చె వచ్చె
నప్పుడా రామరాట్ప్రియ నటుకుఁ దెల్పెఁ, "దప్పెట్లులో తెల్పుఁ" డనెడి వాఁ డస్తుకొంటకు
క॥ గతదినమే కౌముదిఁ జూ, చితి నే మద్దానికొంటకు, శ్రీకరుఁ డలదీ
క్షితుఁ డటుఁ "బశ్య" యనియును గా, హృతిఁ జూపెఁ నూర్పి సుందరి యేమన వచ్చున్,
తే॥ గీ॥ పాపరిపుల రాకఁ గానల్లబలములయాలి, వాదమున కేసు వెంచి యవ్వాసరమున
నలువు నష్టావధానఁపు నమయమందు, నగల నడుగంగఁ జేసె నమ్మొంటకుచేత
ఉ॥ అంత కొకింత పూర్వగ్రహాహ సమస్యయు బూర్తియొనర్చి పోయి సి
ద్ధాంతగ నుండియున్ "మునుపు చెప్పితిఁ గాదని తప్పటంచు సి
ద్ధాంతము సేయఁగా వలయు నాసుడి యట్లొనరింప నేని బు
ద్ధాంతులు వైరలిం గ్రుతనఁ దాఁడన యుండుదు" రంచు నెంచుచున్. ౨౧౦
క॥ అది యెట్లు తప్పగు నని తత్, త్సమవాయము చూడకయె పెనస్ సాహసమున్
మది నూని మున్ను బలెఁ "దప్పది" యని పల్కితిమి పేమనాతంకముగన్.
ఆ॥ వె॥ "ఎట్లు తప్పసెప్పఁడీరి, యని యతిపిన, యంబుమెఱయమమ్మనడిగె మొంటకు
'ఇపుడు గాదు పిదప నీవని తీరిచి, చెప్పవార' మనుచుఁ జెయ్యలుడిగె. ౨౧౨
ఉ॥ కౌముదిఁ జూచియుండియు నఖండుఁడు రామకవీంద్రుఁ డన్నదు
ద్దామత కోపటించి మది ధైర్యము చాలక మిన్నకుండె నం
బారి ముగిసెఁ బధానము క్రమమ్ముగ నంతట రాత్రి యయ్యె నా
యా మహితుల్ గృహమ్ములకు నమ్మయి నేగిరి సంతసమ్మునన్ ౨౧౩
ఉ॥ ఏమను నింటికేగితిమి, యేగెడునంతకె శ్రీయుత్తగం బొం, ం
వేమను జుండొ తెచ్చె నట నెందును రామకవీంద్రు వాక్యలు లే ౨౧౪

---

* శ్లో॥ యః పశ్యతి జగత్సర్వం యోన పశ్యతి సర్వతః, తాపుపూపరమా త్మానంపశ్యాపశ్యా చ పశ్యతః॥ (విస్తరమునకు 'పశ్యాంపుశ్యాం' చూ)

---

## శ్రీబ్రహ్మశ్రీ తిరుపతి వెంకట శాస్త్రుల వారికి,

బ్రీ॥ ......... రావు వ్రాయున దేమన గారి నిన్నటి దినము శతావధాన ములో బ్రహ్మశ్రీ ......య్య, అను నొక పృచ్ఛకుఁడు అడిగిన "పశ్యాపశ్యా సపశ్య

దామెయిఁ జూచి "రామకవి కంటెఁగ ధైర్యము లేదులే" దటం
చేము మదిన్ దలంచి *ప్రతి యించుక వంపితి మల్లజాబుకున్.

---

తః" అను సమస్యతప్పని మీరు అనేక పర్యాయములు వక్కాణించి యున్నారు. ఈరోజున ఉదయము కూడా "తప్పలేదని చెప్పినవంటివాఁడెవ"డని పండితదూషణతో ఉల్లంఘన జేసియున్నారు. ఈరోజున అష్టావధానసమయమున తిరిగి అపృచ్ఛకుడే ఆవిషయమును అడుగగా సభానంతరమున మీరు చెప్పిన విషయమును సమర్థించుకొందుమని చెప్పియున్నారు. గనుక మీరు చెప్పినప్రకారం తప్పను చూపించుటకు సామర్థ్యము కలిగిన యడల పండిత సభ చేయించుటకు సిద్ధముగాను న్నాము. అందుల కీయకొననిచో వ్రాతపూర్వకముగా సమస్యలో తప్పలేదని యొప్పకొనుచు "సమస్యతప్ప అని చెప్పటయే తప్పు" అని మీరు తెలియపరచవలయునని కోరుచున్నాము. పండితదూషణనివృత్తికొరకై యేది విధియో ఆప్రకారము జరుగవలయునని కోరెదము. సాహసముగా సభలో పండితదూషణ చేసినందుకై ఇట్లు వ్రాయవలసివచ్చినది. వెంటనే జవాబీయగోరెదము. కాలయాపన ఉభయత్ర కష్టము.

Yours Sincerely,

(ఇంగ్లీషుచేవ్రాలు.)

2-10-11

Narasaraopeta.

---

*శ్రీమత్పరదేవతాయై నమః.

మహారాజశ్రీ ......... రావుగారికి—

అయ్యా

తమయుత్తరమందినది. అందప్రస్తుతవిషయములు కొన్ని వ్రాసినారు. నేను పండితదూషణము చేయలేదు. ఆసమయమున మాయుచ్చరించినమాటలు విద్యావిషయములు గాని పండితదూషకములు కావు. అదియటులుండనిండు. ఇది పండితవిషయముగాని తమ విషయము కారు కావున నావిషయమై తమకు జ

